శ్రీ

# నవకథామంజరి

గ్రంథకర్తలు:

**పుణ్యమూర్తుల రాజశేఖరము, బి. ఏ; బి. ఇడి.**
సెంటు జోసెఫ్స్ బాయ్సు హైస్కూలు, గుంటూరు.

**అజ్జరపు పార్వతీశము,**
ట్రైన్డు అసిస్టెంటు, గవర్నమెంటు ట్రెయినింగుస్కూలు,
రాజమహేంద్రవరము.



పరిష్కర్త:

**బ్రహ్మశ్రీ నేతి సుబ్బరాయశాస్త్రిగారు,**
మ్యునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు,
ఏలూరు.

---

ప్రకాశకుడు:

**అజ్జరపు పార్వతీశము**
రాజమహేంద్రవరము.

1932



[వెల రు. 0—12—0

# విషయసూచిక.







(శ్రీ)

# నవకథామంజరి.



శా॥ "ఆరంభంబులకెల్ల జీవనము మహాత్మా! నీవకావే? భవ
త్కారుణ్యామృత వృష్టిఁ గొందు ఫలముల్ గార్యంబులే నీ దయిన్
భారంబంతయు వైచి పౌరుషము యావచ్ఛక్తిఁ గావింతుఁ బ్రా
పై రక్షింపవె సత్ప్రయత్నములు; దేవా! భక్తచింతామణీ."

భక్తచింతామణి.

## చిఱుతొండఁడు.

కావేరితీరమున కాంచీపురమను పుణ్యక్షేత్రము గలదు. అందుఁ దుంబురుఁడను నొక గంధర్వుఁడుండెను. ఒకనాఁడతఁడు భార్యాసహితముగ నీశ్వరారాధనమునకై పోవుచుండెను. మార్గమున దుర్వాసుఁడు దనకుఁ గావలసినది తనివితీర భుజించి భుక్తశేషమును లేడిపిల్లలకుఁ బెట్టుచుండెను. ముని

చేయు పోషణమునకుఁ దుంబురుఁ డచ్చెరువడి సంతోషమునఁ జిటికవేయు లేడిపిల్లలా చప్పుడు విని భీతిఁజెంది పారిపోయెను. దుర్వాసుఁడు కోపించి మీరు మనుజులరై పుట్టుడని శపించె. ఈశాపవశమున నితఁడొక వైశ్యునింట జన్మించి చిఱుతొండఁడను పేరునఁ బరగి తిరువెంగనాంచి యను నామెం బరిణయమై యామెయందు సిరియాళుఁడను నొక కుమారుం గనియె. ఈ వైశ్యదంపతులు శివభక్తులు. జంగములకుఁ బెట్టినగాని భుజింపరు. అతిథులకుఁ బెట్టక వారెన్నడు కుడువరు. ఒకనాఁ డతిథు లెవరును దనయింటికి రాకుంటచేఁ జిఱుతొండఁడు వీధివీధికిఁ బోయి చూచి యెవరును రాకపోవుటకు విసిగి మఱలిపోవుచుండెను. అంత వృద్ధులు రోగులునగు దంపతులు గనఁబడ వారిదరిఁజేరి "మీదర్శనమున నాజన్మము పవిత్రింబయ్యె. మాగృహమునకు దయచేసి నాచేయు నాతిథ్యము స్వీకరింపుఁడు" అనియె. వృద్ధదంపతులు చిఱుతొండని జూచి, "మేము శివభక్తులము. శివవ్రతము చేసియుంటిమి. ఆవ్రతమున కుద్యాపనకావలయును. ; మేము కోరినదాని నీవొసంగిన నీయాతిథ్యము స్వీకరించెదము." అని చెప్పిరి. చిఱుతొండఁడు సమ్మతించెను. మఱియు నావృద్ధదంపతులాతనితో "ఓయీ! నీవు మాకిపుడు నీకుమారుని మాంసము వండిపెట్టవలయును. ఇందుకు నీభార్య సమ్మతింప

నిచో మావ్రతభంగమగును. గావున నిపుడు మీయింటికిఁ జని నీభార్య యభీష్టముఁ దెలిసికొనుము." అని చెప్పిరి.

అంత వాఁడింటికి వచ్చి జరిగిన వృత్తాంతమంతయు భార్యకుఁ దెలుప నామె "కుమారుని మాంసమే కాదు. మన మాంసము కూడ నిచ్చుటకు సిద్ధముగనుంటిమని చెప్పు" మని పలికెను. చిఱుతొండఁడు దిరిగి వారల దర్శించి, యా వృద్ధదంపతులు తన్నుఁ బరీక్షచేయుటకు వచ్చిన పార్వతీ పరమేశ్వరులని తలఁచికొని, భార్య ప్రత్యుత్తరము దెలిపి వారిని దన భుజములపై నెక్కించుకొని తనయింటికిఁ దీసికొనివచ్చెను. సిరియాళున కభ్యంజనము చేసి వానితల్లి తన కాళ్ళమీఁదఁ బరుండబెట్టుకొనెను. తండ్రి కుమారుని సమీపించి దయాహీనుఁడై యమసదనమున కనిచి మాంసకండరములను భార్యకీయ నామె పచనము చేసి వృద్ధదంపతుల భోజనశాలకు రావించెను. వారు వచ్చి యుచితాసనములపై కూర్చుండియుండ నెదుట విస్తళ్లు పరచి మాంససహితముగ వడ్డనకావించెను. దంపతులు దమకు విందొనరించిన వారిఁజూచి, "మీయింట బాలుఁడెవ్వఁడును లేఁడా? లేనియెడ మేమిచట భుజింపనొల్లము." అని పలికిరి.

చిఱుతొండఁడు దీనుఁడై "స్వామీ! మాకొక పుత్రుఁడు మాత్రమేయుండెను. తమసెలవుచొప్పున వానిని జంపి వాని కండరములు వంటచేయించితిని. ఇఁక నాకు కుమా

రుఁడు లేఁడని చెప్పెను. దంపతులు జాలిఁజెంది నీపుత్త్రుని పేరుపెట్టి గట్టిగాఁ బిలువుము. వెంటనే నీకుమారుఁడు వచ్చి కనిపించును అని పలికిరి. చిఱుతొండఁడు సంతోషించి నాయనా! సిరియాళా! అని బిగ్గఱగాఁ బిలిచెను. అపుడు వీధినుండి సిరియాళుఁడు వచ్చి నరదంపతుల రూపమున వచ్చిన పార్వతీ పరమేశ్వరులకును తలిదండ్రులకును నమస్కరించి, నిలువఁబడియె. అంతట నాదంపతులు తమ నిజ రూపముఁ జూపి చిఱుతొండని యతిథిపూజకును శివభక్తికిని మెచ్చుకొని వారి పూర్వవృత్తాంత మెఱిఁగించి యాసిరియాలుఁడే కుమారస్వామియగుటఁ దెల్పిరి చిఱుతొండఁడు శాపవిమోచనముఁబొంది పూర్వరూపమున గన్పట్టెను.



# వేదవతి.



పూర్వకాలమున కృశధ్వజుఁడను మునీశ్వరుఁడు మాలావతి యను నామెం బరిణయమై సుఖంబున నుండెను. ఈతండు సమస్తవేదముల నామూలాగ్రము గ్రహించి పఠనము చేయుచుండెడివాఁడు. కొంతకాలమునకు భార్య గర్భవతియై నవమాసములు నిండ, భర్త వేదము పఠించు సమయమున నొక కొమరితం గనెను. ఆమెకు వేదవతి యని నామకరణముసేసి, వివాహ వయసున నీమెను విష్ణుమూర్తికే యిచ్చి వివాహము చేయవలయునని తలఁచు చుండెడివాఁడు. ఇటుండ నొక దనుజుండీమె సౌందర్యమునకు మెచ్చి తనకు వివాహము సేయుమని కోరెను. మునీశ్వరుఁ డందుకు సమ్మతింపమి నద్దనుజుం డలిఁగి యాతనిఁ జంపెను. భర్త చనిపోయిన దుఃఖము పట్టఁజాలక భార్యయు నతికాలమున మరణించెను. తన నిమిత్తమున తలిదండ్రులఁ బోగొట్టుకొనిన వేదవతి దుఃఖమును పటఁజాలక, యొక సంయమినియై కృష్ణాజినకమండలువులఁ గైకొని యొక యరణ్యముఁ జేరి తపము సలుపుచుండెను.

లోకకంటకుండగు రావణుండచటి కరుగుదెంచి మానరిబున నున్న యౌవనితంజూచి నీపేరేమి? నీవెవరి కొమరితవు? నీపతి యెవరు? ఇట్టివనంబున నేకతముగ తపమున

నుండఁగతంబేమి? అని యడిగెను. వేదవతి వినియు విననిదానివలె నటించి యతిథి సత్కారంబాచరించెను. దనుజుండీ ప్రశ్నములఁ దిరిగి తిరిగి యడుగ "అనఘా! నేను కృశధ్వజుఁడను మునీశ్వరుని కొమరితను. ఆయన వేదాధ్యయనం బాచరించి యాసుకృతంబున నన్నుంగని వేదవతి యను నామంబిడి విష్ణునకిచ్చి వివాహము సేయువలయునని తలఁపుననుండెను. ఆయన తలంపెఱుంగక పలువురేగుదెంచి నన్నుఁ దమకు వివాహము సేయుమని కోరియుండిరి. అట్టివారిలలో నొకఁడగు జంభుండను రక్కసుండు తనకోరిక కనువగు ప్రత్యుత్తరముం బడయజాలమి నసంతుష్టిం జెంది నాతండ్రింజంపివైచెను. భర్తృవియోగంబు సహింపఁజాలక నాతల్లి మరణించెను. నాటనుండియు నేను నాజనకుపూనికిఁ దీర్పఁదలంచి విష్ణుని మదినిల్పి యతండె నాకు మగఁడగునని యిట్లు తపంబు సేయుచుంటిని" అని పలికెను. రావణుండు విని "యౌవనమున సుఖంబులు వీడి కష్టములఁ కోర్చి శరీరము శుష్కింపఁ జేయుట యుచితంబుకాదు. లలనా! విష్ణుఁడన నెవ్వఁడు నిర్జరులనైన జయింపఁగల సమర్థుండనై లంకాపట్టణము నేలుచు సకలైశ్వర్యముల ననుభవించుచుండిన నన్నొల్లక యెవఁడో విష్ణుఁడు నీకు మగఁడు కావలయునని చెప్పెదవు. ఆతని మీది చిత్తంబు విడిచి నన్నుం జేకొని యథాసుఖంబుగ విహరింపుము." అని చెప్పెను.

ఆ ఆవిసఁ జెవులు మూసికొని యిట్టులను లోక
వంద్యు వేద వేద్యు వరదుఁ బరము
ననుపమాను నచలు నవ్యయు హరిఁ జెన
వాడఁ గూడదని మృగాక్షి మఱియు.

చ. తపములకెల్లఁ దాన ఫలదాత కులంబున కాదికర్తయై
యపరిమిత ప్రభావుఁడగు నాచతురాస్యుఁడు నాభిఁ
బుట్టె వి
శ్వపతి యహీనబాహుబలసార ఘనుల్మధుకైటభాది దై
త్యకతులనెల్లఁ దున్మెడఁ చె వారయవిష్ణుఁ డమాన నీ
యుడే.

ఈపలుకుల నెంతయు విశ్వసింపక యద్దాన వేశ్వరుండు
డాయ నయ్యంగనయలిఁగి యోయి! నీవుపులస్త్యుని పౌత్రుఁ
డవని నాతపః ప్రభావమున నెఱిగి నీకతిథిసత్కర్మ సముయో
చితంబుగఁ జేసితి. ఛీ! పాపాత్మ నీమాటలిటఁ జెల్లవు అని
యాస్థలము విడిచి పోవనున్న సమయమున దశకంధరుండు
సమీపించి యామె వేనలిఁబట్టె. అంత నయ్యంగన యొక
వ్రేల వ్రేయ, నది కత్తి విధంబునఁ దాకి కత్తిరించిన
క్రియ వెండ్రుకలఁ దెగి, నవి యారక్కసుని చేతిలోఁ
జిక్కె. అట్లు వెండ్రుకలు చేతవచ్చుటను రావణుఁడు వెఱఁగు
పడుచు నామె తపము పేర్మికి నచ్చెరువొంది నిశ్చేష్టుఁడై

పిలిచెను. వేదవతి వానిం జూచి "తపమునందుండిన నేను నిన్నిపుడు శపించిన తపంబునకుం జేటుగలుగునని యూరకుంటిని. నామనసు నిజముగ వారిపై నుండె నేని నీకు నేను మృత్యువనై నస్నుతపుణ్యజాతయనం జాలి నీలంకను బునరుద్భవమొంది విష్ణుమూర్తి నేగ్రహించి నీవంశనాశన మొనరించెద." అని చెప్పి, యిట్లు పరాభవంబు నంది యీతనిచేం దాకంబడిన శరీరముపై తీపియేలయని దిగ్గన నవలంబాపాదించి విష్ణుని మనమున నిడి సొదంజొచ్చి దగ్ధమయ్యెను.

పిమ్మట కొంతకాలమునకామె లంకయందు తామరపువ్వున జన్మించి మొదట రావణునకుం గనంబడ నతండు తన యాస్థానమందలి జోస్యులకీవార్తం దెలుప నీమె జన్మమరిష్టసూచకమనిరి. రావణుండా శిశువునొక బంగారు పేటికయందునిచి సముద్రమున వదలిపెట్టించెను. పెట్టె కొట్టుకొని పోయి పోయి, తుదకు మిథిలానగర ప్రాంతముం జేరి యచట భూమిలో గ్రుక్కంబడియె. మిథిలాధిపుండగు జనకుండు సంతానముంగోరి పుత్రేష్టి చేయుటకై భూమి దున్నించుచుండంగ నాగటిచాలున నద్భుతమగు మందసము కన్పట్టె. దాని బయటికిదీసి ముద్రాభంగ మొనరింప రాకానిశాకర రేఖవోలె నొకకన్నియ జూపట్టె. దానిం జేకొని సీతయను నామంబిడి యబ్బురంబుగం బెంచి యయోధ్యాపతియగు దశరథునికి నీశ్వరప్రసాదమునం గౌసల్యాదేవియందు నారాయణాంశంబున

జన్మించిన రామునకొసంగి వివాహము చేసెను. ఇట్లు కొంత కాలము గడువ ముసలియగు దశరథుండు రామునకు నేక రాజపట్టాభిషేకము సేయనున్న సమయమున, నాతని మఱియొక భార్యయగు కైక తనకు పూర్వము భర్త యొసంగిన రెండువరములఁ దెలిపి రాముని పదునాలుగేండ్లు వనవాసమునకుఁ బంపుమనియు తన ముద్దుకొమరుఁడగు భరతునకు బట్టముగట్టుమనియు జేనింగోరెను. ఆడితప్పనియద్దశరథుండందుల కంగీకరింపవలసిన వాఁడయ్యెను. రాముఁడు వనమునకుఁ బోయెను. సీతాలక్ష్మణులు రాముని వెంబడించిరి.

అరణ్యమున రావణుని సోదరియగు శూర్పణఖ తిరుగులాడుచుండగ నామె కొమరుఁడగు జంబుకాసురుఁడొకపొదలోఁ జేరి తపముఁజేసి కొనుచుండెను. లక్ష్మణుఁడా పొద చెంతఁజేరి ఫలములఁ గోయుచు నచటనుండినయసురుఁ జూడక కత్తితోఁ గొట్ట నారక్కసుఁడు మరణించెను. తన పుత్రుని జంపినవారెవరని శూర్పణఖ వెదకుచు, నరులు చంపిరని తెలిసికొని తన కొమరుని జంపిన నరులను మ్రింగ వలయునని కోపముతో రామలక్ష్మణులను సమీపించెను. కాని వారిరువురఁ జూచినవెంటనే రూపలావణ్యములకు లోనై యామెచిత్తము చంచలింపఁ దన్ను వివాహముకమ్మని రామునిఁగోరెను. ఏకపత్నీవ్రతుఁడగు నాతఁడు సమ్మతింపమి

లక్ష్మణుని సమీపించి తన వాంఛితము వెలిపుచ్చ నతఁడును సమ్మతింపఁడాయె. శూర్పణఖ తనకోరిక నెరవేరమికి దుఃఖించి యిందుకు సీతయు కారణంబని యాగ్రహంజెంది యామెను బాధింపఁజొచ్చెను. లక్ష్మణుఁడిది యెఱింగి దానిముక్కు చెవులుఁ దెగఁ గోసెను.

అంత నామె యపారమగు దుఃఖమును బొంది వెంటనే లంకకుఁబోయి తనయన్నయగు రావణునిఁ జూచి "అన్నా! దండకారణ్యమున నెవరో యిద్దఱు మానవమాత్రులు తిరుగుచుండిరి. నన్ను నీచెల్లెలననియైన యోచింపక యానరులెట్లు చేసిరో చూచితివా! ఈపరాభవము నేనెట్లు సైతును. నన్ను పరాభవించుట నిన్నవమానించుట కాదా? మఱియు వారితో నొక సుందరాంగియుఁ గలదు. ఆమెకు నీవే పతివిగాఁ దగియుందువు. ఆమె సౌందర్యము వర్ణింప నెరికిఁ దరముకాదు. ఎటులైన నీవచటికిఁ జని యా సుందరాంగిని కొనితెమ్ము" అని హెచ్చరించెను. రావణుఁ డందుకు సమ్మతించి యతిరూపముఁదాల్చి రామలక్ష్మణు లింటలేని సమయము గని సీతను సమీపించి తన వృత్తాంతముఁదెలిపి నిజరూపముఁదాల్చి, తనవెంట వచ్చినచో లంకకు రాణిగఁ జేసెదనని యామెతోఁ జెప్పెను. సీత వాని రూపముజూచి భయపడి మూర్ఛనొందెను. పడియుండిన జనకజం బొదివిపట్టి తన యరదముపైఁ బెట్టుకొని లంకకుఁ

గొనిపోయెను. రామలక్ష్మణులు పర్ణశాలకువచ్చిచూచి సీత లేమికి కడువిచారము జెంది లంకాధిపుండగు రావణుఁడు సీతనెత్తుకపోయినట్లు తెలిసికొని వెదకుచు మార్గమున కిష్కింధాపురముఁ జేరి సుగ్రీవునితోఁ జెలిమిఁ జెంది హను మ తుని లంకకుబంపి సీత వృత్తాంతము తెలిసికొని వానర బలముతో బయలుదేరి లంకనుజొచ్చి పుత్రామాత్యమిత్ర బంధు సహితముగ రావణ కుంభకర్ణుల వధించి సీతం గైకొని నిజపురంబునకు జనిరి. రావణుని మరణమునకుఁ గారణమగు సీత పూర్వజన్మమున వేదవతి.



# కాలనేమి.

ఇతఁడు రావణుని మిత్రుఁడగు మారీచుని కుమారుఁడు. ఇంద్రజిత్తు లక్ష్మణునిచే వధింపబడిన వెనుక రావణుఁడు రామలక్ష్మణులతోఁ బోరి వారిపై బాణవర్షము గురిపించి శక్తిప్రయోగమున లక్ష్మణుని మూర్ఛనొందించె. అట్లు పడియున్న లక్ష్మణుఁజూచి రాముఁడు "ప్రాణతుల్యుఁడగు నా సోదరుఁడు విగతజీవుఁడై మేదినిపై వ్రాలె. ఇఁక నాబ్రతుకెక్కడ? సీత యెక్కడ? నాతమ్మునికొఱకే సంగర మెక్కడ సంభవించెను?" అని విలపించుచుండెను. సుషేణుండు లక్ష్మణుఁ బరీక్షించి రామునితో "లక్ష్మణుఁడు మృతుఁడుగాఁడు. ముఖమున కళలెప్పటివలె నున్నయవి. కరతలంబు పద్మపత్త్రంబుల పగిదిఁ జూపట్టెను. నయనంబులు ప్రసన్నతవహించియున్నయవి. నాడియందేమాత్రము దోసము కనిపించదు. విగతజీవునకిట్టి చిహ్నములుండునా?" అని పలికి రాఘవేంద్రుని మనమునఁ గల సందియంబు పోఁగొట్టెను. మఱియు నామ్రోల నిలిచియున్న మారుతిఁజూచి, "ఓయీ, తడయక నీవోషధిశిఖరికడకుఁ జని దాని దక్షిణ శిఖరంబుననున్న విశల్యకరణి, సంధానకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి యనఁ బరగు దివ్యౌషధములఁ దెల్లవారక పూర్వము గొనితెచ్చి

లక్ష్మణుని బ్రతికింపు"మని పలికెను. వాయునందనుండు వల్లెయని 'యుత్సాహపూరితుండై యొక్క మహానాదంబుఁ జేసి సముద్రప్రాంత కాంతారమండితంబైన యొక కొండ నెక్కి యమ్మహామహీధరంబు మహీతలంబునం గ్రుంగఁ బాదంబులూఁది గగనంబున కెగసి మహావేగంబున నుత్త రాభిముఖుండై పోవుచుండె. అప్పుడావృత్తాంతంబు చారుల వలన దశగ్రీవుండు విని యొక్కింతసేపు విచారించి యర్ధరాత్ర సమయంబున నెవ్వరికిం గానరాకుండ మారీచపుత్త్రు మందిరంబునకుం జనియె. అటనుండిన యాతుధానులందఱుఁ గాలుండని శంకించి భయంబునఁ దొలంగి నొక్కవెరవున వానిడాయుంజనిరి. అపుడు రావణునిరాక యెఱింగి కాలనేమి శీఘ్రంబున నెదురేగి వినయంబునం దోడితెచ్చి యుచితాసనంబున నాసీనుం జేసి నానావిధోపచారంబులు గావించి మెల్లగ, "దానవేశ్వరా; నేను జేయఁదగుపనియుండిన పిలిపింపక యీనడుఱేయి నిటకు రాఁదగునా? అయిననిచ్చటకి నొంటరిగఁ జనుదెంచిన కార్యము నానతిమ్ము. నేదాని వేవేగ నొనరించి కృతార్థుండ నయ్యెద" నని పలికెను. కదనంబున లక్ష్మణుండు మూర్ఛితుండైన నాతని బ్రతికింపఁ బూని మారుతనందనుండు తెల్లవారులోపున సంజీవనిఁ దేర ద్రోణగిరి కేగుచున్నవాఁడు. ఆలక్ష్మణుండు సూర్యోదయమైన పిమ్మట పునర్జీవితుండు గానేరఁడు. కావున నంతదనుక నీనేరుపు నుపయోగించి ప్రయాణమునకు విఘ్నముసేయుము. నీవు నీజనకుని పగిది

మాయల నేర్చియుంటివి. వేగముగఁ ద్రోవకు నడ్డముగఁ జని కదనంబొనర్చి యవ్వీరుం జంపుము. ఇఁక నొక్కయుపాయం బుగలదు. అది యెద్దియన నో మారీచనందనా! ద్రోణగిరి సమీపమున నొక్క యగాధంబైన సరోవరంబు గలదు. అందు ఘోరంబైన యొక మహాగ్రాహి నివసించియుండు. ఇంద్రాది దేవతలైన దాని నోరంబడి గ్రమ్మఱ బ్రతికి వచ్చుటకు సమర్థులు గారు. నీవచట మాయామయంబైన యొక్క తాపసాశ్రమంబు నిర్మించి యందొక్క మునివై యుండి యుపాయంబున హనుమంతు నక్కొలనికడకుం బుచ్చుము. అతఁడమ్మకరిచేత మ్రింగఁబడినవాఁడై మృతుండగు. దానం జేసి మన యుద్యోగంబంతయు సఫలంబగు. నీవీ కార్యంబు గావించి కీర్తి వడయు” మని రావణుఁడు చెప్పెను.

ఈమాటలు విని కాలనేమి “ఓదనుజవల్లభా! నీ మాటల కెదురు వలుక నెవరికి శక్యంబు? నీవు పంచినయట్ల శక్తి వంచన లేక కార్యంబు నెరవేర్చెద. అయిన నాకుఁ దోఁచిన యొక్క మాటను విన్నవించెద. నీభయమున మజ్జనకుండరిగి శ్రీరాము శరంబులఁ గూల్పంబడెను. ఆమహాత్ముని పేరు విని నంత మాత్రమున నాగుండె లవియుచున్నయవి. అంతియకాక ఖరదూషణులును ప్రహస్తుఁడును కుంభనికుంభులును కుంభకర్ణుఁడును హరిహయతుల్యవీరులగు నయ్యతికాయమహాకాయులును మేఘనాథుఁడును కదనంబున మడిసిరి. రాముని జంపుట

యటు తోఁచి నీవాతని కడకేఁగి జానకి నిచ్చి రక్షింపుమని వేఁడుటయు నీయనుజుండగు విభీషణు రావించి యాతనికి లంకా రాజ్య మిచ్చి నీవు వనంబున కేఁగుటయు నుచిత" మని చెప్పె ను. రావణుం డిది యంతయు నాలకించి పాదతాడిత భుజం గంబుఁబోలె లేచి చంద్రహాసంబుఁ జేబూని వానిం దెగవ్రేయఁ బోఁడంగ. కాలనేమి భయంబుగొని నీకింత కోపంబేల? నీవం చినయట్ల కావించెద నని పలికి నమస్కరించి యనుజ్ఞవడసి వేగంబునఁ బోయి పావని మార్గంబునఁ దన మాయచే నతి రమ్యంబుగ నొక్క యాశ్రమంబు నిర్మించి కపటముని వేషం బుఁ దాల్చి మిథ్యాజపంబు సేయుచు హనుమదాగమనంబు బ్రతీక్షించుచుండె.

అంత నతికాలంబునకు హనుమంతుం డేఁగుదెంచి యమ్మాయాశ్రమముం జూచి తనలో "మును జాంబవంతుని యానంగొని సంజీవకరణిం దేఁ జనునప్పు డిట్టివనము గన్పట్ట దయ్యె. భ్రాంతాత్ముఁడనై ద్రోణభూధరముఁ జేరెడి త్రోవఁ దప్పితినో, లేక యిది మాయాశ్రమమో తోఁచకున్నయది. ఇది యొక నిజమగు నాశ్రమమైనచో నొక ముని పరుఁ డుండక మానడు. కావున నీయాశ్రమముం జొచ్చి యమ్మహా మునిచేఁ ద్రోవ చొప్పెఱిఁగి పోయెదనని యనుకొనుచు తరుగుల్మలతాదులఁ బరికించుచు బోయిపోయి యొక పర్ణశా లాంతరమున విభూతి రుద్రాక్షతలఁ దాల్చి కాషాయవస్త్రము ధరించి జటాజాలబంధంబు శిరమునఁ బాదుకొలిపి యిరువం

కల దండకమండలువులనునిచి నాసికాగ్రమునఁ జూడ్కులు నాటించి యోగాసనంబునఁ గూర్చుండి నయనయుగళ మర్ధని మీలితంబైతినర్వ జపమాల పూసలు దిప్పికొనుచు ముని వేషధారియై కపటజపము సలుపు కాలనేమిని జూచెను.

ఆతనిని నిక్కంపు మౌనిగఁ దలంచి వినయ వినమిత గాత్రుఁడై విమలభక్తి వందనమొనర్చి యమ్మాయాతపసితో "మౌనివరేణ్యా! నేను మారుత పుత్రుఁడగు హనుమంతుడను వాఁడను. ద్రోణగిరినుండి దివ్యమహౌషధులఁ గొనితెచ్చు టకుఁ బోవుచుఁ ద్రోవతప్పితిని. నిజముగు తెఱఁగుఁ జెప్పినచోఁ బోవుదు. అంతియకాక మునీంద్రా! దప్పినిబడలియున్నవాఁడ ఈవనంబున నిర్మలతోయంబైన జలాశయంబొక్కటి గలదేని యానతి" మ్మని యడిగెను.

మాయాతపసి కనులదెఱచి "వాయునందనా! జానకీల క్ష్మణసహితుఁడై రాముఁడు కానలకేగుటయు, రాక్షసవల్లభుం డు జానకినెత్తుకొని పోవుటయు, రాముఁడు వనచరోపేతుఁడై వారాశిబంధించి లంకకుఁ జనుటయు లక్ష్మణుఁడు రావణ శక్తిచే రణరంగమున మూర్ఛ నొందుటయు నవనివాయకుని పంపున నీవుద్రోణాద్రినుండి సంజీవనీకరణి నామకౌషధంబు తేఁబోవుటయు నేను యోగదృష్టిచేఁ గనుఁగొని యున్న వాఁడ. నీవు సర్వలోక హితకరుఁడగు రామునకు భృత్యుఁడ వగుటం జేసి నాకు మిక్కిలి పూజనీయుఁడవైతివి. అమ్మహా

త్తుని కార్యంబు నీకుంబోలె నాకు నవశ్యకర్తవ్యంబై యుండు. నేనిక్కాఁడొక్క మంత్రంబు నీకుపదేశించెద. దానిఁ బ్రతిగ్రహించితివేని నీకభీష్టలాభసిద్ధియగు. సంగ్రామంబున శత్రుజయంబుగలుఁగు. అమ్మంత్ర ప్రభావంబున దివ్యౌషధులు దమయంతం దామ పొడసూపు. అదియునుంగాక మదీయాశ్రమంబున నమృతకల్పంబులైన పక్వఫలంబులు సమృద్ధంబులై యున్నయవి వీని నుపయోగించి సుధోపమంబైన మదీయకమండలు జలంబుద్రావి యీరాత్రి యిచ్చట వసియించి సంజీవన్యాది దివ్యౌషధు లిచ్చటనె యున్నవి గాన వానింగొని ప్రభాతకాలంబున యథేచ్ఛంజనుము. మత్ప్రసాదంబున క్షణమాత్రంబుననే లంకాపురంబు ప్రవేశించెదవు." అని చెప్పెను.

విషమిశ్ర మధూపమంబైన వాని వచనంబులు విని వాయునందనుండు "మునిశేఖర! లంకాపురంబున లక్ష్మణుని మూర్ఛచే రాముఁడు వ్యసనియైయుండ నేఫలములు భుజించి యెట్లిచట నిద్రింతును? ప్రొద్దుపొడిచిన సౌమిత్రి మనఁడు గాన నెట్లైన నీరాత్రి మందులుఁగొని శీఘ్రమున లంకకు జేరవలయు. నీకమండలు జలమున నాదప్పి దీఱును. ఇవ్వనంబున హ్రదమెచ్చోటఁ గలిగిన నచ్చటికరిగెద. జాగుసేయక

సెలవి" మ్మని పలికినఁ గృత్రిమముని మందహాసవికసితము ఖుఁడై యనిలసూనుని గనుఁగొని, "ధీరవరేణ్యా! తూర్పుదెస నొక దివ్యసరోవరముగలదు. శీఘ్రగామివై యచటికరిగి కనులుమూసికొని యాసలిలము దప్పిదీఱఁ గ్రోలి చనుదెమ్ము. నీకొక మహామంత్రం బుపదేశించెద" నని పలికి యొక శిష్యుని తోడిచ్చి పంపెను. వాయుసుతుండు సరోవరము సమీపించి లోపలకు దిగి యతిపిపాసితుఁడై నీరు ద్రావుచుండగ, మును మకరము పంతంబున దంతిరాజుఁ బట్టినమాడ్కి యొక మకరి హనుమంతుని పాదములుపట్టెను. బలవంతుండగు వాతండు తన వాలంబున దాని దంతములు విఱుగం బ్రహరింప స్థానబలిమిగల మకరి పావని గాఢముగఁ బట్టి మ్రింగఁజొచ్చెను. ఆసమయంబున ననిలతనూభవుండిక నేమిసేయుదును. నన్నీమకరి తప్పక మ్రింగును. నేనిందుల దీనిచేఁ జావవలసివచ్చినది. అచట రామకార్యమేమగునో ఇప్పటికి సూర్యవంశయశంబును కీశవంశకీర్తియు నశించెడి కాలంబాసన్నంబయ్యె.

అని విచారించి కొంతవడికి ధైర్యమవలంబించి యిప్పుడు కలవళింపనేల. అల్పగాత్రుండనై దీనియుదరంబు ప్రవేశించి వధింతుఁగాక. అని నిశ్చయించి యంగుష్ఠమాత్రుం

హై గరళపు ముద్దయుఁబోలెమండుచు దానికుక్షిలోనఁబ్రవేశించి శరీరంబుఁ బెంచి దాని నరములు ద్రెంచి నెమ్ములు చూర్ణంబులుచేసి మాంసంబుఁ జెక్కి సంధులు సడలుగావించి ప్రేవులు ముద్దచేసి యూపిరి వెడలి రాకుండఁ గంఠబిలంబున కడ్డంబుగఁ బడియె. మకరి యావేదన సహింపంజాలక యిదినాకు నలుగు నాహారంబుగాదు. దీన నిక్కంబుగ మరణంబు సంభవించునని తలఁచి యూపిరి వెడలక కొండొక సేపునకు పంచత్వంబునొందె. అంత నమ్మరున్నందనుండు దాని యుదరంబు ఛేదించి వెలపలికి నిర్గమించి ఘోరంబగు మకరి కళేబరంబీడ్చికొని శీఘ్రంబునఁ దత్సరోవరతీరంబుఁ జేరె. అంత నమ్మకరి తన యాకారమువీడి సుందరాకారయువతియై చూడనొప్పె.

మారుతి యీమార్పుంజూచి యచ్చెరువొంది ఆహా! మకరరూపముమాని భూరితేజో రమణీయమూర్తియగు సుందరియై కనవచ్చెడి. ఇదియేమిచిత్రము. అని తలఁచుచుండగ నాయువతి, "మారుతీ! నీప్రసాదమున మకరరూపము వీడి నేటికి నా స్వశరీరముఁ దాల్చితిని. నాకష్టములు గట్టెక్కి కృతార్థనైతిని. మఱియు "నోయనిలనందనా! ఇది దితిజ మాయావినిర్మితవనంబుగాని మునితపోవనిగాదు. కాలనేమి

యను రక్కసుండు దశకంఠునానతిఁ దన మాయచే దీని సృజించి తాపసివేషంబుదాల్చి నీకంతరాయము సేయ వేచి యుండె నీనిమాటలు విశ్వసింపక వధించి ద్రోణాద్రికరిగి దివ్యౌషధములఁ గైకొని రయంబున లంకకుంజని లక్ష్మణున కిచ్చి బ్రతికించి సత్కీర్తి వడయుము. ఏను ధాన్యమాలిని యను పేరంబరఁగు నప్సరఃకాంతను మహాత్ముండైన శాండిల్యముని శాపంబున నీసరోవరంబునందు మకరినై యుండు టెఱింగి యున్న వాఁడగుటం జేసి, రావణుండు నాచేత నిన్నుఁ జంపించువాఁడై మారీచనందనుండైన కాలనేమియనువానిఁ బనిచిన, వాఁడిమ్మాయావనంబు నిర్మించి కపటముని వేషంబు దాల్చి యుపాయబలంబున నిన్ను చటకి బంపెను. నేను శాప వశంబున నినుఁబట్టి మ్రింగితి. నీవు మహాబలవంతుఁ డగుటం జేసి నన్ను వధించి కుశలివై తీరంబునకుం జనుదెంచితివి. ఏను భవత్ప్రసాదంబున మునిదత్త శాపవిముక్తనై గ్రాహ రూపంబుఁ బరిత్యజించి యెప్పటియట్ల దివ్యరూపంబు ధరించి కృతార్థనైతి. నేనింకఁ బురందరుని కొలువునకుం జనియెద. అనుజ్ఞ యొసంగు" మని పలికి యదృశ్యం జనియె.

అంతఁ బవమాన నందనుఁడతి రయమునఁ గపట వేషధరుఁడగు కాలనేమికడకుఁ బోయిన నవ్వీరుంగాంచి యుతండు "అనిలతనూజ! ఏమియింత జాగు సేసితివి? జలములఁ

గోఁలి దప్పితీర్చుకొంటివా? నేనిపుడుపదేశింపనున్న మంత్రి రాజమును స్వీకరించిన, దాన నన్నిమందులు గనవచ్చు. దీని కెనయగు గురుదక్షిణనిమ్ము." అని పలికెను. అంత నవ్వాన చరుండు,

క. గురుమంత్రింబున కెనయగు
గురుదక్షిణ యొసఁగఁబోలుఁ గొనుమిదె నీకుఁ
గురుదక్షిణ యిచ్చెదనని
గురుముష్టింబొడిచె వాని గుండియలవియఁ.

అంత నమ్మారీచనందనుండు క్రోధపూరితుఁడై తత్క్షణంబ కృత్రిమమునివేషంబు బరిత్యజించి నిజరూపంబుఁ దాల్చి మండలాగ్రంబున నాసుగ్రీవ నఖుని వక్షంబు వ్రేసిన నతండు చెందువడక గండుమిగిలి కరతలంబెత్తి దురాత్మా! నీమాయలిటఁ జెల్లవు. మదీయ పాణిప్రహారంబుఁ గొనుము దీన నీకుం జావు సిద్ధించు. ఇఁక నెక్కడికేఁగవచ్చునని తర్జించుచుఁ బెడతలవ్రేసెను. అంత నారక్కసి డస్సి పక్షిరూపంబు దాల్చి పక్షసంజాతవాతంబులఁ దూలందోలుచు నిశాతనఖంబుల వ్రచ్చుచు విజృంభించిన, నమ్మహాబలనందనుండు నిశాత నఖంబులఁజీరుచు కఠోరముష్టిం బొడుచుచు దీర్ఘవాలంబునం దట్టుచుఁ జరణనఖతుండ పతత్రింబులు విఱిచి నుగ్గుసేసె. అంత వాఁడు పతత్రిరూపంబు మాని సింహాకారంబు

దాల్చి హుంకారంబుఁ జేయుచు రభసాతిరేకంబునం గవిసిన నప్పవన నందనుండు శరభంబులీల నవలీల వానిమీఁది కుతికి ముష్టిపాతంబునఁ దదీయ దంష్ట్రలు విఱుఁగంబొడిచి నెమ్ములు విఱుఁగ బాదంబులు దన్ని కరతలంబున శిరంబు వగుల వ్రేసెను. అంత నద్దానవుండా రూపంబు చాలించి సుగ్రీవ రూపమునుం జెంది "మారుతీ! లక్ష్మణుండు మూర్ఛదేఱి దశగ్రీవునితో కడు ధైర్యంబున సంగ్రసమరంబు గావించుచున్న వాఁడు. ఇంక సంజీవనీకరణిం దేవలదు. ఇచ్చట నుండి గ్రమ్మర లంకకుం జనుదె" మ్మని పలికెను. హనుమంతుండిది రాక్షసమాయగాని నిక్కముగ వీఁడు సుగ్రీవుండు గాఁడు. వీని మాటలు విశ్వసింపఁదగవని యెంచి సుగ్రీవా! మనము చిన్ననాటనుండి యుదయమున వ్యాయామము సలుపుచు తుదను ముష్టిఘాతంబులు సలుపుచుంటిమిగదా. నాముష్టిఘాతంబునకు సుగ్రీవుం డొక్కరుండ సహింపఁదగు. నీవు నిజముగ సుగ్రీవుండవైన నాపిడికిలి పోటుల కాగుము అని గంధసింధురంబు పైకి లంఘించు సింగంపుఁ గొదమభంగి వానిమీఁది కుతికి దంతంబులురాల నెమ్ములు విఱుగ శిరంబువగుల ముష్టిఘాతంబుల బడలువడం జేసిన నమ్మాయా సుగ్రీవుండు కాలనేమి రూపంబుఁదాల్చి కోదండంబుగొని కాండప్రకాండంబు వరఁగించుచుఁ గొండొకసేపు నానాప్రకారంబుల భండనంబు గావించె. అప్పుడప్పవనచరశ్రేష్ఠుండు కాలాత్యయంబైన గార్యంబు చెడు. తడవుగాకుండ వీని వధింప

ఖలయునని తలంచి లయకాలరుద్రమూర్తి తెఱంగున కాద్రి రహోల్లాస భాసురుండై వాలచలనంబునఁ దదీయ శరపరఁ పరలు విఱియఁ దట్టుచు నద్దనుజాధముని గ్రిందం బడఁ ద్రోచి తానుమీఁదై సర్వాంగసంధులు నొప్పించి హీనసత్వుం జేసి కంఠనాళంబుఁ ద్రెంచి వధించి కాలుప్రోలికిం బుచ్చి ద్రోణాద్రిం జేరి యోషధులసహితంబుగ నాయద్రి నూడబెఱికి కొని వచ్చి వానరసేనా మధ్యంబున డించి కౌసల్యానందనుని చరణారవిందంబుల కభివందనంబు గావించి సుగ్రీవ జాంబవదాదులకు నమస్కరించె. సుషేణుఁడు గావలసిన యోషధులం దీసి యొక సిలాఫలకంబుపై నిష్పేషణముచేసి సౌమిత్రికొసఁగ నావృధుబలుండు క్షణములో మూర్ఛదేఱి విశల్యుండై నిద్రితుండగు పురుషుఁడు మేల్కాంచిన తెఱంగున లేచి సుఖాసీనుండయ్యె.



# సుబుద్ధి—దుష్టబుద్ధి.



మాహీనగరంబున సుబుద్ధి దుష్టబుద్ధియనను వర్తకులిద్దఱు తద్దయు సౌహార్దంబు గలిగి వర్తింతురు. వారు ధనార్జనము సేయు తలంపున లాఁతి ఠిలాతికింజని కొంతకాలంబుమ్మడి వ్యాపారంబుగావించి యభిమతం బొడఁగూడుదు నభిజనంబునకు మరలి యరుదేర దుష్టబుద్ధి సుబుద్ధితో "మనము ధనంబానయించుట ప్రకటింపంజనదు. న్యాయార్జితంబిది యెవ్వరెఱిఁగిన గొఱంతయేమి యనకుము. పరఘాసముత్కరసనార్జితంబగు మధువుం గఱుణఁదొఱఁగి లోకులు చేకొందురిగాదె? కావున నగరంబునకుఁగడ నెక్కడనే నొక్కయెడ మన రొక్కంబు గుప్తంబుగానించి పోవుదము. వలసిన తఱి వచ్చి పుచ్చుకొందము." అని యొడఁబడం బలికి యిరువురును ధనంబు సర్వంబొక బిందెయందు బొందుపఱచి సాభిజ్ఞానంబుగ నొక వటావృక్షంబుచెంత లాఁతు తెలియఁగకుండం బాతి తమ యిండ్లకరిగి యెప్పటిచొప్పు దప్పక చెలిమి గలిగి సుఖంబుండిరి.

ఇట్లు కొంతకాలంబు గడచిన నొక్కనాఁడు దుష్టబుద్ధి గుప్తప్రకారంబునంజని యాబిందియుంగ్రొచ్చి పుచ్చుకొని

వచ్చి డాఁకటికం బొనరించి పిదపఁ గొంతకాలమునకు సుబుద్ధి గనుంగొని "మనము ధనంబుఁగొనివత్తము. మనకింక శంకింపంబనిలేదు. పెద్దకాలంబు లోకులం గనుమూసితిమి. ఇప్పుడు మనయొద్ద రొక్కంబులేదని యుల్లంబులందెల్లరు విశ్వసించియున్నవారు. వెఱవెఱింగినఁ గొఱాతలేదు. రాజ స్వాంతంబగు విషయంబున వసించుచున్నవారము. చను దెమ్ము" అని తోకొని చని గుఱుతు పరికించి యచ్చటం గ్రొచ్చి చూడ ధనంబు గనపడదయ్యె. అంత దుష్టబుద్ధి తనముందట విషణ్ణుఁడై నిలుచున్న సుబుద్ధింజూచి కరంబున నురంబప్పళించుకొని "యోరీ మిత్రద్రోహీ! ఆహా! యెంత పనిఁ జేసితివిరా. ఎప్పుడో యొంటివచ్చి ధనంబపహరించి యేదియు నెఱుంగని వానితెఱంగున నాయెదుర విషాదం బభినయించి దక్కించికొనం జూచెదవే? ఇచ్చటఁ డాఁచిన ధనంబు మనముదప్ప నన్యులెవ్వరైన నెఱుంగుదురే? అది నీవెఱుంగకుండఁ గళ్లుపచ్చి నడచిపోయెఁ గాబోలు. కా నిమ్ము; రారమ్ము. నిన్నుఁ బోనిచ్చెదనే? వారి వీరివలె దుష్టబుద్ధి యులాతులం బోవువాఁడని తలంపకు. నాసొమ్ము నీచేతఁ గ్రక్కింపకుండిన నేనొక మగవాఁడనే" యనుచుఁ గినుక హెచ్చుగఁ దెచ్చుకొని గ్రక్కున బైరవాసంబు పుచ్చి నడుమున బిగియజుట్టుకొని సుబుద్ధిం గటివస్త్రంబునం గరంబు జొప్పించి న్యాయస్థానమునకు రమ్ము. నీవక్కడఁగాని చక్కఁ బడ[illegible] [illegible]క్రింతు సుబుద్ధి మనంబునం దేవసించి [illegible]

ఱేల నేలవిడిచి సాముచేసెదవు, నామాటలువిని యూరక నీకుఁ దోఁచినట్లు చేయుము. పట్టువదలు" మన దుష్టబుద్ధి నాలుక మిగుల రానీకుము. నీకుఁ దాళికయుండుఁగాని సొమ్ము గోలుపోయిన నాకుం దాళికకు నెంతదూరము. ఇంతచాలక నీకలుకలు సహితము వినవలయుఁగా? నిన్ను విడిచెదనే యన సుబుద్ధి నీవు రమ్మనిన చోటునకు వచ్చెద. పోదము. చేపట్టు విడువుము. అని విడిపించుకొని వెంబడింబోవ నాతండు న్యాయాధిపతిని సమీపించి తన వృత్తాంతమంతయు నివేదింప రెండవయాతండును మహాప్రభూ! అట్లు మేమిద్దఱము ధనంబు గుప్తంబు గావించి యిర్వురు గ్రొచ్చిచూడఁ గానంబడదయ్యె.

నేనింత యెఱుంగుదు. మఱియొక్క పాపంబెఱుంగ. నా విని న్యాయాధిపతి ధర్మాధికృతుల రావించి ఫిర్యాది ముద్దాయీల నప్పగించి వీరితగవు దీర్పుండని నియోగింప వారు వారి వివాదం బవధానంబుతోడ నవధరించి ఫిర్యాదిం జూచి ముద్దాయి ధనముగొనినందుకు సాక్షులున్నారా? యని యడిగిరి. అయ్యలారా! దొంగ పెరలెఱుంగ దొంగిలించువాఁ? మేము ధనంబుఁ బాఁతినచోట వటవృక్షంబొక్కటిదక్క నన్యంబులేదు. కటకటా! యింక నేనెక్కడనుండి సాక్షిఁ దెత్తునని యాననంబు దీనంబుగావించుకొనివలికి కొంత చింతించి వెండియు నిట్లనియె. ఇదే నాశపథంబువినుండు. నేను

నామాతరపితలకు భక్తుండనేని స్వప్నావస్థయం దయినం బర ద్రవ్యంబు హరియింపుందలంతునేని సత్యశీలుండనేని నవ్వట వృక్షంబగుణాగణ్యులరగు మీరెల్లరు వినసాక్షి. భావంబున అంబించి సత్యంబు పలుకుంగావుతమని యెలుంగెత్తి పలుక నీతండట్టి మహానుభావుండో యిట్టిశపథంబుగావింప మత్తి యొకనికి శక్యంబే యనియు శపథమాత్రంబున నేమయ్యెఁజెప్పి నచొప్పు తుదముట్టఁజూడక యిదమిత్థమ్మని నిశ్చయింపరాదు. కల్లనిజంబులు దైవంబ యెఱుంగుననియుఁ బరికింప నీతండె ధనం బపహరించి యాతనిపయి నిందమోపి తాను సత్యవం తుండనిపించుకొనవలయునని యింతగొంతుగావించెదుంగాబో లుననియు నచ్చటం జూపరులు పెక్కుతెఱంగుల నాడికొను చుండ సభాసదులు కతంబు వెలుఁగుపడి యన్యోన్యముఖావ లోకనంబుగావించి యిట్లు శపథం బత్యంతచరంబని మెచ్చు టించుచు నవ్వణిజులంజూచి నేఁడు మిక్కిలి ప్రొద్దుపోయెను రేపు పలువాతరండు. మీవివాదంబు పరిశీలించెద మనవుడు వర్తకుని వారలు తమ నిలయంబుల కరిగిరి.

అంత దుష్టబుద్ధి నాఁటిరేయి నిజగృహ బహిర్ద్వారంబు కవాటపిహితంబు గావించి గర్భాగారముం జేరి తన జనకుని రావించి యాతనితోడ భూగుప్తధనాపహారణంబాదిగ స్వకృ తంబు సర్వంబు నివేదించి "అర్థంబు సకలపురుషార్థ సాధనం బు ధనంబునకు దుస్సాధ్యం బొక్కటి లేదు. లోకులు కుల

విద్యారూప గుణవిహీనుఁడేని ధనవంతుని సర్వసంపన్నుఁడని పఠియింతురు. సకల దురితంబులకు దారిద్ర్యంబుం బోలె సకల దురిత క్షరణంబునకు నర్థంబు నిదానంబు తదార్జనంబునకై చేయుదురితంబు పాపితంబునం బాపికొన వచ్చుఁ గాన నెవ్విధంబుననేనిఁ బురుషుండు ధనం బార్జింపవలయునని నీతికోవిదులు వక్కాణింతురు. దానం బట్టి యొక్కఁడనయి రొక్కంబు సంపాదించితి. హా స్వగతంబగు విత్తంబు దక్కించుకొను వెరవుగలిగియు పిరికితనంబున జాఱవిడువనేల? ఒక సముపాయంబు చింతించియున్నవాఁడ వినుము. జాగుసేయక వేగకమున్న పోయి యా మఱ్ఱిత్రొఱ్ఱనడంగి యదృశ్యుండవయి యుండుము. రేపు ధర్మాధికృతులు చనుదెంచి యీవృత్తాంతంబు నడుగుతఱి జంపుగావింపక యచ్చట ధనంబు సుబుద్ధి హరియించెనని యెత్తిపలుకుము. ఇంతమాత్రంబు నాచెప్పిన చొప్పు గావించితేని మనపక్షంబు జయించు.

అనవిని యాతండు పాయంబు చింతించుచో రాఁగల యుపాయంబు సహితము చింతింపవలయు. లేనిచో శాబకంబులం గాచికొనం బోయి కోలుపోయిన బకంబుచందంబగు ఆకథ నీకుఁ జెప్పెద నాకర్ణింపుము.

ఒక నింబవృక్షంబుమీఁద బకమిథునంబు చేరి వాసంబు చేయుచుండె. అంతఁ గొంతకాలంబునకు బకాంగన గర్భంబు

దాల్చి తనభర్తతోడనేగి యక్కడక్కడం జిమగులు ముక్తా నం గలుచికొనివచ్చి గూఁడుపన్నికొని యండంబులిడి పొదిగి బోదలంగావించి యేదుచు నొక్కనాఁడు తనపెనిమిటి కిట్లనియె.

తొల్లి యీవృక్షంబుమీఁదఁ బక్షులనేకంబులు వసించుచుండ వానిపిల్లలనెల్ల యీక్రిందిపుట్టలోని కాలభుజంగంబు భక్షించిపోవ దానిరాయిడింబడఁజాలక యాపులుంగులెల్ల వలసపోయె. ఈవృత్తాంతము విన్నయప్పటంగోలె నామనం బెరియుచున్నయది. ఎటుంగక యీతరువుం జేరితిమి. అక్కటా! ఈనత్తురుఁగందుల నొక్కయిడుమదొడరిన నేనెట్లు సైరింతునని బోటబోటం గన్నీరు దొరుఁగ నెలుంగుతుత్తుకం దగుల మాటరామి నూరకున్నదయితంగనుంగొని బకోటంబు దానుంగొంత చింతించి యేలయూరక యుమ్మలించెదు. మన ముమ్మలికంబడి కొండొకకార్యంబు సాధింపంబోయెదమె? ఊఱడుము. శత్రువుం బరిమార్చువెరవు మనంబునందొక్కటి పరికించితివినుము. మునిగిపోదదొరకొని యీపుట్టదనుక నక్కడక్కడ నొక్కొక్కమీనంబును వైచియుంచెద. అట్లు చేసిన మనయిష్టంబు సిద్ధించునవిఖలికి యాత్రణంబబోయి కొలఁకునమీలంబట్టి యట్లువెచియుంచుడు. మునిగినపోదపెస లి యమ్మీనంబులం దినుచువచ్చి పుట్టపట్టుంజేరి యాయురగంబుం బరిమార్చి యాభూరుహాం బారోహించి బకశాబకం బులభక్షించి చనియె.

కావున నొకటిసేయఁబోయిన మఱియొకటియగు వ్యవహారంబనుసునఁ బాలినకంబంబు. తుదకు సేవంతకు నొఱగునో తెలియఁగంబడదు. కావున నీకార్యంబు శ్రేయంబుగాదనినాతఁడాడెను. అనిన దుష్టబుద్ధి "మొదలఁదోఁచిన యుపాయముంబట్టి పురుషుండు ప్రవర్తింపవలయుఁగాని యుపాయంబున కపాయంబు నపాయంబున కుపాయంబును జింతింప దొరఁకొనిన నెక్కడికి మందల. సందియంబునొందక నావచనంబునడపుము. మనకు సమస్తంబు శస్తంబయ్యెడునని బోము గావించి యెట్టకేలకు నీకొన్నపితరుని దొంగరేయుటంగాని బోయి యామ్రానిలోనికోటరంబున మాటువరిచి యిరవున కరుగుదెంచి రేయింబుచ్చి రేపకడ ధర్మాధికృతుల కడకుంబోవుడు ముద్దాయియు నరుదేర వారిద్దఱుం దోడ్కొని జనకలకలంబు రోదోంతరంబు నిండంబురంబు వెలువడి కుత్రితచరాశి క్షానంబుఁ బట్టి యావ్వటవృక్షంబు చేరంబోయి నిలిచి యోవృక్షరాజంబ! ఈపిర్యాది ముద్దాయిలిచట ధనంబు గుప్తంబుఁ గావించి యనంతరంబేమి గావించిరి. నీవుసాక్షివగుటంజేసి యెఱింగినది సర్వంబు సత్యంబుగ బలుకు మనుటయు 'నిచ్చటఁ బాఁతిన ధనంబొక్కనాఁ డర్ధరాత్రంబున సుబుద్ధియొక్కఁడవచ్చి కొంపోయె' నని యావృక్షవిటపమధ్యమునుండి శబ్దంబు వెలిరం దత్రత్యజనంబులు చిత్రంపడి చిత్రపుత్రికలరూపంబునఁ జూపట్ట సుబుద్ధి కొండొక మానంబున విచారించి ధర్మాధి కారులం

గాంచి యార్యులారా! ఇది నిక్కంబని తలంపకుఁడు వృక్షంబన నెక్కడ సాక్ష్యంబు పలికెనన నెక్కడ కృష్టతాడనాద్దన్త భగ్నయున్నట్లున్నయది. సెలవిచ్చిన నేనిప్పుడ యీవృక్షంబు సాక్షిభావంబు మీకెల్లం దెల్లంబు గావించెద నని వేఁడికొని తదనుజ్ఞాతుండై యావృక్షం బారోహించి దాని కొమ్మలయు, బనుగొమ్మలయు నంతరంబులెల్ల నారసి స్కంధశాఖ నొక్కంట మహాగుహయుం బోలె విశాలాంతరాళంబై తమోమయంబగు కోటరంబుఁ గాంచి లోనం జొరవెఱచి యొండు గాదంబు పందెడు దెప్పించి యందుఁ జొప్పించి యింగలంబిడి దరికొలుపుడు మహాభీలంబగు జ్వాలాజాలంబుచే బొదువంబడి మేనుగమర నంతర్వర్తియగు ముదివగ్గుఁ బెగ్గిలి వెగ్గలంపుఁ దాపంబున కోపక మొఱయిడుచు వెలికుఱికి నేలంబడి నీవెవ్వండవు నీవృత్తాంతంబేమి? యని ధర్మాధికృతులచేత ననుయుక్తుండై యేను దుష్టబుద్ధి పితరుండ వాఁడు నామాట పెడచెవింబెట్టి నాకిట్టి యాపదంబుట్టించె నని చెప్పి కరంబార టంపడుచుఁ బ్రాణంబులు దొఱంగె.

అంత ధర్మాధికృతులు సుబుద్ధికి దుష్టబుద్ధిచేఁ బాతిన ధనంబెల్ల నిప్పించి యారు మాసంబులు కఠిన శిక్ష విధించి పుదుచ్చేరి జైలునకుఁ బంపివేసిరి.



# ఉత్తరుఁడు.



ఇతఁడు మత్స్యదేశాధిపుఁడగు విరటుని కుమారుఁడు పాండవులు ద్వాదశాబ్దంబు లరణ్యవాసముసలిపి మాఱు వేషములఁ బూని మాఱుపేరులతో నజ్ఞాతవాసమునకై విరటుని నగరమునకువచ్చి యచట నాతనిచెంత సేవకులుగనుండిరి అప్పటినుండియు నాదేశప్రజలేమియు నీతిబాధలుబొందక బంధుసమేతముగ సర్వసంపదల ననుభవించుచుండిరి. ఉర్వర మాతవోలెఁ బ్రజలఁ గాపాడుచుండెను. అతివృష్ట్యనావృష్టి దోషంబులులేక నెలకు మూఁడువానలు గురియుచుండె. అప మృత్యువులెక్కడనులేవు. జారతస్కరాబద్ధక యాచకాదు లెచటంగానరారు. బధిరాంధాది వికలాంగులు నెందుకైనం గనబడరు.

హస్తినాపురమునఁ గౌరవులు పాండవుల జాడలెఱుంగ మి కళవళపడుచు విరటునినగరమునఁ బ్రచ్ఛన్నవేషములతో నుండిరని తెలిసికొనలేకపోయిరి. అయినను వారెచటనుండిన నచట దేశము సుభిక్షముగనుండునని యెఱుఁగుదురు. ఈ సమయమున విరటునిదేశము సుభిక్షముగనుండుటచే పాండవు లచటనుండవలయునని గ్రహించి త్రిగర్తదేశాధీశ్వరుఁడును

దుర్యోధనుని మిత్రుండునగు సుశర్మ దుర్యోధను నవలోకించి మిత్రమా! దేశంబులనెల్ల నిపుడు మత్స్యదేశంబెంతయు సుభిక్షముగ నున్నయది. దానంజేసి పాండవులచట వరిచ్ఛన్న వేషంబులనుండిరాయని యూహింతు నర్హంబు ఆదేశాధిపుండగు విరటుఁడు వారలఁజేర్చి మనకుఁ బగవాఁడై మనల మోసముజేయుచుండవచ్చును. కావున మనమాతనిపై నెత్తిపోయి యాతని గోధనంబులగ్రహించిన ధర్మజాదులు సహింపలేక యుద్ధపడం బఱతెంతురు. అపుడు మనము సమయ భంగంబు సెప్పి వారలం గ్రమ్మఱఁ బండ్రెండు వత్సరంబులు వనవాసంబు నలుపంబుత్తము. అటులైనఁ జతురంత భూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము. అందు లేక తక్కిన, నావిరాటు సమస్త వస్తువులను జూరకొందము. అదియును లాభంబ. ఎల్లభంగుల నిప్పటి కిదియె కార్యం"బని చెప్పెను.

దుర్యోధనుఁ డందున కియ్యకొని యొకసైన్యమాయితము సేసి విరటు గోవులఁ బట్ట సుశర్మను బంప నావిరాటుసుశర్మలు పెను సంగ్రామంబు గావించిరి. ఇందు సుశర్మ విరటు నోడించి వానిం బట్టి తెచ్చి తన రథమున నునిచెను. ధర్మజుం డలిగి యాతని విడిపించుటకు భీముని బంప నాతండు రయంబున నేగి సుశర్మ నోడించి ధర్మరాజు కడకు లాగికొని

పోయెను గాని త్రిగర్తేంద్రు సుశర్మను సపరివారంబుగా విడిపించెను.

మఱునాఁడు సూర్యోదయావసరమునఁ దుర్యోధను భీష్మ కృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ దుర్ముఖ ప్రముఖుల యాధిపత్యంబున మత్స్యనగరంబున కనతి దూరంబున విరాటు పశుగణంబులం బాదిరి. గవాధ్యక్షుండిది యంతయుఁ గౌరవబలంబగుట యెఱింగి రథంబు దోలికొని యాక్రోశించుచుఁ బురంబునఁ గరుగుదెంచి రాజమందిర ద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్న యుత్తరునితో "రాజనందనా! కురుసైన్యములిటువచ్చి మనగోవర్గమును ముట్టడివేసికొని పోవుచున్నవి. విరటుఁడు నిన్నెప్పుడును శౌర్యశాలి, బాహువిస్ఫురితుఁడు కులభూషి, విశేషవిధాయకుండు, జనభవ్య తపఃఫల సంభవుఁడని పలువుర ముందటఁ జెప్పుచుండును. కావున నీవీ తరుణమునఁ జని శత్రు సైన్యముల నోడించి వాటిని మరలించి నీశౌర్యధైర్యముల వెల్లడింపఁ గడఁగు" మని చెప్పెను. "సమయమునకు నాకుఁ దగిన సారథి లేకపోయె. తగిన సారథియే యుండిన నొక్క ముహూర్తమాత్రమునఁ గౌరవుల నెదిర్చి గోవులఁ దెత్తు"నని కోటలోని స్త్రీలయెదుట నుత్తరుఁడు బీరములు పలికెను. తత్ప్రదేశంబున నుండిన ద్రౌపది యిదియంతయు విని యర్జునునితో జరిగిన వృత్తాంతమంతయు విన్నవించెను.

అజ్ఞాతవాసవత్సరం బతీతంబగుట నిరూపించి అర్జునుఁడు పాంచాలితో "మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవదహనంబునఁ బాండవమధ్యమునకు సారథియై యతనిచిత్తంబు వడసె. మఱియుఁ బెక్కుదలం దదీయంబగు రథంబు గడపఁ దానై యుండుట నేనెఱుంగుదు. ఆతని సహాయంబున నీవు గురుసైన్యంబుల జయించివచ్చుటకు సందియంబు వలదు" అనియుత్తరునితోఁ బలుకుమని చెప్పెను. సైరంధ్రి వల్లెయని చయ్యన నుత్తర నర్తనశాల కరిగి బృహన్నల చెప్పుమనిన దంతయు నాపెకు విన్నవించి యుత్తరునకుఁ దెలియఁ జెప్పుమని కోరెను. ఉత్తర సైరంధ్రి సహితముగ నుత్తరుఁడున్న తావునకుం జని జరిగినదంతయుఁ దెలియఁ జెప్పెను. అతండు పాంచాలింజూచి చిఱునగవున నేను ఖేసింజూడకోయుదు. అట్లుండ నేనాతని రణమున సారథిగఁ జేయు టెట్లు? మఱియును మన గోవులఁ బట్టవచ్చిన కురుసైన్యముల నెదుర్కొనుటకు నేఁబూని బృహన్నలను సారథిగఁ జేసిన నలువురు నవ్వరా? అని పలికెను. ఒక్క కౌరవసేన మాత్రముగాదు. ముల్లోకములు నేకమై యెత్తివచ్చినను బృహన్నల సారథ్యము బూనినంత వరకెంతయు జయమునకు సందియము లేదని సైరంధ్రి చెప్పెను.

ఇట్లు మానమున నూగులాడుచు నేమిచేయునదియుఁ దోఁచక తనకపుడోరుతేరును తేమింజేసి బృహన్నలను దోడ్తె

మ్మని నుడివెను. ఉత్తర సైరంధ్రితో బృహన్నల యుండిన నర్తనశాలకరిగి గురువరా! కౌరవులు పసులం బట్టిరని తెలిసి మాయన్న సన్నద్ధుండై వెనుకం దగుల నమకట్టి సారథ్యంబుసేయ వాఁడు లేమికి విషాదంబు నొందిన సైరంధ్రి నీ సామర్థ్యము గుఱించి తెలుపఁ బ్రియంబంది నిన్నుఁ దోడ్తెమ్మని నన్నుఁ బనిచె. నీపాలవారుఁ జనవు గలుటంజేసి యెల్లవిధంబులం దెత్తునని పూనివచ్చితి. నాపలుకులు గుఱుచ సేయక నీపెంపునం బ్రకటంబుగా నయ్యుత్తర కుమారునకు రథంబు గడప నియ్యకొని యుద్యోగపడఁ దలఁగవలయును. ఇట్లాడంబడక తక్కుటలు నావలని వాత్సల్యంబు గొఱంత పరుచుటయే యని నుడివెను.

బృహన్నల యమ్మృదుయ పలుకులు ముద్దుసేసి సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్తన నడతెంచు మత్తశుండాలంబునుంబోలె నరుగుదెంచి యుత్తరు దర్శింప, “నాకుఁ గౌరవులతోఁ గయ్యంబుగలిగె. నీసామర్థ్యము గుఱించి సైరంధ్రి యింతవరకు నాకుఁ దెలిపియుండెఁ గావున నేను గోరినయట్లు నీవు నాకు సారథివై రథము నడుపు” మని చెప్పెను. బృహన్నల యుత్తరుంజూచి రాజనందనా! ఆటపాటలుగల యప్పనుల నన్నుఁ బిలువనొప్పుఁ గాని సంగరమున సారథివి కమ్మని పలుకుటుచితంబె? సామర్థ్యము గల యతని యేర్పైన నియమింపుమని చెప్పెను. అంత సై

రాటి ఖాండవదహనంబున నీవు రథచోదకవృత్తి నలిపి జయము గలిగించితివి. అపరిత్రాణమిపుడేమాయె. కొండొక మాట చెప్పక దయయుంచి రణోత్సహనం బొనరింపుము. రథమున హయములఁ బూన్పుము. ఇపుడు మనము గోచయముఁగొని విజయముగాంచి వత్తమని పలుక "నీవేమి చెప్పిన జేయుదు. నీవున్న యెడ నుండెదు. నాశక్తి వంచన లేక పని చేయుదు. పగఱ గెలువుము." అని బృహన్నల చెప్పి మనంబున ముదంబొదవ జవనాశ్వముల రథంబునకుఁ బూన్చి పంచానన కేతువెత్తి ధనుస్తూణీర కృపాణ ముద్గరాది వివిధ సాధనంబులు రథంబుపైఁ బదిలంబుగ నిడి నొగలెక్కి సుత్రిక్కి నక్కెంజేసె. ఉత్తరుఁడు గోపాలకుని బసులం బట్టినచోట నడుగ పితృవనంబు దిశనని చెప్పెను. అంతట రథారోహణంబు సేసి వెడలిన వృద్ధాంగనాభూసుర సమూహంబులు బృహన్నలంజూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబునన్నైన మాంగల్యంబెట్టి దట్టిద భవత్సహాయంబున భూమింజయమున కయ్యోదుమని దీవించిరి.

రథంబు పరేతనిలయప్రాంత ప్రదేశంబు సేర కౌరవ సైన్యము నుత్తరుండుగని, తొట్రుపడుచు దిగులుసొచ్చి యో బృహన్నలా, కార్ముక విద్యాప్రౌఢిమై నిరూఢులైన యా శకుని జయద్రథ దుర్ముఖ వికర్ణాది యోధవీరుల, నకృతా ‍ఁడును బాలుఁడు నగు నేనెట్లెదిరింతును. ఇట్లగునని

మొఱఁగక వచ్చితిని. వీరల మాఱ్కొనుశక్తి నాకిసుమంతే యు లేక మనమున భీతిగలుగుచు, నొడలు పులకరించుచు, చెమటలు పట్టుచున్నయది. రథమును ముందునకుఁ బోనీయక వెనుకదారి పట్టుము అని చెప్పెను.

బృహన్నల దరహసిత వదనుండగుచు, నామిషంబు గాని మార్గమువట్టిన తుచ్ఛసైన్యము నెదిర్చి గోవుల మరల్చెదము గాని యసదృశలీలఁ బొల్చు రథంబులపైకి బోవుటకు నేనంత వెఱ్ఱినా? అంతఃపురమునందలి యువతు లెల్లను మెచ్చునట్లుగ గోగణము నిమిషంబున మరల్చెదనని బీరములు పలికి తగుదునయ్యాయని రథమెక్కి వచ్చి యిచట దంతితురంగ భద్భటకదంబముఁ జూచి యిట్లు ధైర్యము వీడ నీకుఁ దగునా? అని చెప్పిన యజ్ఞుడు మాటలు విని హీనస్వరమున నోబృహన్నలా! ఇంటిలోఁ గూర్చుని కాల క్షేపము చేసెడు యువతుల సంతోషము నాకేల? నాదారిని నన్నింటికిఁ బోనిమ్ము. నేను యుద్ధమున కెంతయు నసమర్థుఁ డనని చెప్పెను. అంత బృహన్నల విరటుని కౌమరుండవై యరిబలంబుల బలంబునైన విమర్శింపక జ్యానాదంబును బృంహితంబును ఖురాహతిధ్వనియు విని జంకి పాఱిపోవుట నీ కెంతయుఁ దగనిపని. ఉత్తరనామధేయుడవు గై కొని యరిబలంబుల నుత్తరించక పాఱిపోయిన జూచువారును ఎదుటి వారును నవ్వి యెగతాళి చేయరా? అని చెప్పెను.

ఉత్త:—బృహన్నలా! త్రిగర్త సైన్యంబులు బహు పరాక్రమంబున గోవులఁబట్ట మాతండ్రి పట్టణమందలి బల మంతయుంగొని యుద్ధంబు సేయబోయెరు. పట్టణంబున నొం డొరులు లేమింజేసి నేనొంటరిగఁ బోవలయును. నేనటుబోయి దుస్సాధంబగు కురుసేనతోఁ బోరగలనా? కావున కౌరవ సైన్యము నెదుర్కొనక యే వెనుకకు మఱలి పురము ప్రవే శించుట తగినదని.

బృహ:—రాజనందనా! పగతురఁజూచి భయమును జెంది యిటులాడఁ దగునా? పసువులు బోవిడిచి, జనంబులు నవ్వ నిందించునట్లు మరలి పోయినదానికంటె నవమానంబు మఱియొకటి కలదా! అదియునుగాక సైరంధ్రి యుత్నముచే నన్ను ప్రయాణముచేసి తీసికొనివచ్చి నీకొప్పగింప నీవు నన్ను సారధిగ గైకొని నంత, మనము పట్టణమును విడిచి వచ్చుతరి పురజనులెల్లరు నిశుంగొనియాశి యనేకవిధాశీర్వా దంబుల నొసంగిరి. అట్టి సందర్భమున నేను గౌరవులఁజూచి వారి బలంబులకు వెరచి పారిపోవుదు ననుకొంటివేమో? నేనట్లు బోవువాఁడనుగాను. కనుక ధైర్యమవలంబించి మనసు చిక్కఁబట్టుము. మనలఁజూచి కౌరవులు భయపడు నట్లు మనబలము నుపాయమును జూపి యాశ్చర్యము జెందు నట్లు పసువుల మరలించి పట్టణమునకుఁ బోవుదము. మఱియు

నీవింతకుమున్ను పురజనంబులు మనలఁజూచి నవ్వుదురని చెప్పితివి.

ఉత్త:—వారు నవ్విన నాకేమి. నన్నిచట నిలుపక పోనిమ్ము. ఇచ్చవచ్చిన నీవు పోయి క్రొవ్వణఁకొనుము.

అని చెప్పి యుత్తరుండు బాణములను శరాసనములను రథముపై దిగవిడిచి రథమునుండి లటాలున దుమికి పట్టణమార్గంబును బట్టి పాఱఁ దొడంగెను.

అతఁడు నూరడుగుల దూరము పారిపోయిన పిమ్మట, బృహన్నలవాతనిం బట్టుకొన, తెలతెల బోవుచు భయమంది వడవడవడకుచు రొమ్ముతటతటకొట్టుకొన బెదురుచూపులతో నాతని మోము తేరిపారఁజూచుచు యేడ్చుచు, నాయందు విశేషప్రేమముగల మాయమ్మయు నవ్వయు నాకొఱకెదురు చూచుచుందురు. నేనువారలఁ జూడఁ బోయెదను. నన్ను పోనిమ్ము మఱియు మాతండ్రిగారితోఁ జెప్పి నీకు వలయు ధనముల నగ్రహారముల నిప్పించెదనని చెప్పెను. బృహన్నల వానిని వదలక తేరుఁజెంతకుఁ దెచ్చి కురువీరులతోఁ బోర నీకశక్యమైన నీవు సారథి వగుము. నేను రథికుఁడనై కౌరవుల యుక్కడఁగించి గోవుల మరల్చెదనని చెప్పి రథముపై నాతని గూర్చుండఁ బెట్టెను.

బృహన్నల రథికుఁడై యొక శమీవృక్ష సమీపము నకుఁ రథము నడపించి "వైరాటీ! ఇమ్మహీరుహంబెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము. ధర్మజాదులు దమతమ సమస్తాయుధంబులఁ గూడం గట్టి యిందుఁ బెట్టినవారు. ఆకట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చుకొని తక్కిటియవి యెప్పటియట్ల బంధింపు" మని చెప్పి శవాకారంబుననున్న యొక కట్టను గనపరచెను. ఉత్తరుఁడది చూచి బృహన్నలా! నేను రాజపుత్త్రుఁడ ననియైన తలంపక యొక పీనుగువలెఁ గనిపించెడి యీకట్టనుండి చాపంబు దీయుమని చెప్పుచుంటివి. ఇట్టి నీచపుపనికి నన్ను నియమించుట నీకుఁ దగియున్నదా? నన్నీపనినుండి విడువు" మని పలికెను.

"మనుష్యులెవరును దాకకుండగ గట్టిన యస్త్రముల కట్టగాని యిది శవముగాదు. శవమైనచో నిన్ను తాకుమని చెప్పుదునా? కనుక సంశయింపక చెట్టెక్కి యాచాపము నాకంది" మ్మని బృహన్నల చెప్పెను.

ఉత్తరుఁడు సమ్మతించి చెట్టెక్కి పైనుండ నర్జునుఁడు దేరిపై నిలిచి, కట్టుముడి విప్పి బాణముల నందిమ్మని చెప్పెను. అట్లు విప్ప నయ్యాయుధంబులు గొప్ప పాముల చందంబున నుంటంజూచి మిక్కిలి భయముజెంది గజగజ వణకుచు, "బృహన్నలా! వీనిలోన ధనుస్సుచూడగా మహాశ్చర్యవంత

పై రెండు పెద్దకొండచిలువవలె కనిపించుచున్నది. దీనిని పాండవులందెవ్వరు ధరించిరి? తక్కుంగల బహువిధంబులగు నాయుధంబుల నెవరెవరు ధరియించిరి? ఆనతిండ”ని యడిగెను. అంత బృహన్నల మొదట నీవు నన్నడిగినది గాండీవము. అదియే నర్జునునకు పలువిధముల నాధారము. దీనింగొని యాతఁడు దేవదానవులనైన నవలీలగ జయించును. దీనిని బ్రహ్మ లక్ష సంవత్సరములును సోముడు నూఱేండ్లును వరుణుఁడు నూఱేండ్లును ధరించిరి. మఱియు నీలోత్పలచ్ఛాయ నెరసి సౌవర్ణ వృషావలి నొప్పు బాణాసనంబు ధర్మజుఁడును, తాళప్రమాణమున ధర్మశాఖా మృగాంచితమగు కార్ముకంబు భీముండును, తీవ్రకుశానల దీప్తాకృతియుఁ గనత్కనక మత్స్యంబులుగల ధనువు నర్జునుఁడును కాంచన మయూరముల శోభిల్లు చాపమును మాద్రిసుతులును ధరియింతురని నుడివెను.

మహాధాత్ముండగు నయ్యుత్తరుండు పాండవులజాడ యెఱుంగవె బృహన్నలా! శత్రుస్త్రీనాయక గర్వతమోభానులగు పాండవులు నాకు మేనమామలు. వారలకు నేను మేనల్లుఁడ. వారిపుడెచట నున్నవారు? పరమసాధ్వియగు ద్రౌపది కష్టములనుభవించుచు నెచటనుండెను? తెలుపుమని యడిగెను. బృహన్నల “వైరాటీ! నీవువారలకు వగవవలదు. విధివశంబున వచ్చినయాపదలకు నోర్చి కొనవచ్చుక రాదును కాండా

లియు నొక్కటఁబండ్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁడగు నేఁడజ్ఞాతవాసంబు సలుపుటకిటవచ్చి మనవీటనత్యాసన్నులైయున్నవారు. కంకుఁడే ధర్మరాజు, వలలుఁడే భీముఁడు, దామగ్రంథియే నకులుఁడు, తంత్రిపాలుఁడే సహదేవుఁడు, సైరంధ్రియే ద్రౌపది. ఇఁక దాచనేల? నేనే యర్జునుఁడ"నని చెప్పెను. అంత భూమింజయుండు సంభ్రమాశ్చర్య సంశయంబులు మనంబున ముప్పిరిగొనం దప్పక చూచి యర్జునునకుఁ బదినామములు గలవు. అవి యెయ్యవి? ఏమేమికతంబున నీ నామంబులు సంభవిల్లె నని యడిగెను. అర్జునుండు సస్మితాననుండగుచు నర్జునుఁడు, ఫల్గునుఁడు, పార్థుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, భీభత్సుఁడు, విజయుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడను నవియే పది నామములు.

ధరణి యెల్లయు గెలిచి ధనము గొని యుండుటచే ధనంజయుఁడనియు, నెట్టివారినైన నెదిరి జయంబు గొనుటచే విజయుఁడనియు, సమర భూములం దెపుడు నాతేరు శ్వేతవాహనములతో నొప్పుటచే శ్వేతవాహనుఁడనియు, నింద్రుఁడొసంగిన కిరీటము తలమీద సమరంబున రవి యుదయించినట్లు వెలుఁగుటచే కిరీటియనియు, భీభత్సవిధము గలుగుకార్యముల నెట్టిసమరమునసైనను దడబడక చేయుటచే భీభత్సుఁడనియు, భండనమున నిరుగేలను గాండీవము దివియ నేర్పు గలిగియుండ సవ్యసాచియనియు, దుర్లభమగు నవబాల వర్ణము

గలుఁగుటచే నర్జునుఁడనియు, నుత్తరఫల్గునీ నక్షత్రమున జన్మిం
చియుండుటచే ఫల్గునుఁడనియు, ననిమొన నెవనిదాకినఁ బరి
మార్తుగాన జిష్ణుఁడనియు, మాతల్లి పృథయైయుండుటచే
పార్థుఁడనియు నీపది పేళ్ళును నివి కారణంబులుగాఁ బ్రకా
శంబులయ్యె.

సకలసురనికరంబు లడ్డపడినం బుండరీకాక్షు సహాయుం
డనై ఖాండవం బేర్చినపుడు మెచ్చి భద్రమూర్తులగు రుద్ర
విరించులు సన్నిధిసేసినం బెన్నిధి గన్న పేదచందంబున సంభ్ర
మించు నాకుం గరుణించి కృష్ణుండును నేకాదశనామంబును
నప్రతిహతబాణంబులు నొసంగిరి వారల యనుమతి నింద్రా
దులైన విబుధులును వివిధంబులగు దివ్యాస్త్రంబు లిచ్చిరి.

అని చెప్పిన విని యుత్తరుండు చిత్తంబున నద్భుత
హర్షంబులు పొదువ మ్రానిడిగ్గనుఱికి సర్వాంగ సంగతోర్వీ
తలంబగు దండప్రణామంబాచరించి చేతులు మొగిచి నిలిచి
నిన్నెఱుఁగలేక యేనన్న పలుకుల మఱది సన్నుం గృపఁజూ
డుమని పలుక యర్జునుఁడు విని తేరుడిగి పైరాటిఁ గౌగిలిం
చుకొనియె ఇట్లు సమాలింగితుండై

చ. మనము కలంకదీఱె రిపుమర్దన విక్రమ మొక్కుతేఱు నీ
ఘనభుజశక్తి ప్రాపున నఖండితశౌర్య మహోన్నతుండనై

యనియెన సారథిత్వము మహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథునదల్పు మరల్పు గోవులన్.

క. మనమునఁ గోరుదు నేన
ర్జునునకు సమరమున రథ్యచోదకభావం
బునఁ బనిసేయవలయునని
యనిశము విధి కరుణనాకు నది సిద్ధించెన్.

అని పలికి నాకుం బనియెయ్యదియో తెలుపుమని యడిగె.

గాండివంబును గాంచన పుంఖంబులగు బాణంబుల తూణీరయుగళంబును మదీయతను త్రాణకృపాణంబులును బుచ్చుకొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టిపెట్టి రమ్మని నియోగించిన నాతండట్లు చేసె.

అర్జునుండు వైరాటిని సారథిఁ జేసి తాను నియతాత్ముండై యధిదేవతలకుం బ్రణమిల్లి భక్తితోడ దివ్యకోదండాదులగు సాధనంబులు గైకొని సవిశేషస్ఫూర్తియగు మూర్తి నత్యంత దర్శనీయత్వంబునొంది రథంబెక్కి యుండా

యాధంబులు పదిలంబుగా నిడి తనుత్రాణ తలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని గాండీవంబుఁ బుచ్చుకొని యెక్కు-పెట్టి ముష్టినలవరించి గుణధ్వనిసేసెను. ఉత్తరుఁడును నాయితంబై నొగలెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబుల యంగంబులు దొడయుచు రథంబు నడపఁ దొడంగుడు పార్థుఁడు రణకౌతుక ముల్లసిల్ల శంఖ మొత్తెను. వాయువులు నిశ్చేష్టితంబులై చావకట్టుగ నవనిఁ బడియె. ఉత్తరుఁడు మూర్ఛజెందెను. ఫల్గునుఁడు తురంగంబుల వాగెలువట్టి యెత్తి తనువులునిమిరి వైరాటుని నూఁది పట్టి విశ్రతంబగు రూపము చక్కజేసి కౌఁగిటఁ జేర్చి యోయీ! శంఖభేరీరవములును సామజముల బృంహితములును నీకుఁ గ్రొత్తలా? ఏమి యిటులు భయపడియెదవని బుజ్జగించి వానియందు ధైర్యంబాపాదించి రథము నడుపవలసియుండిన మార్గంబును దెలియజెప్పె. ఉత్తరుఁడు వివ్వచ్చు నాజ్ఞను బద్ధుఁడై రథము పోనిచ్చి కౌరవసైన్యముల కెదుట నిలుప నొకరివెంటనొకరి ధార్తరాష్ట్రుల యుక్కడగించె. అంతట వారు శౌర్యంబు సాలించి ముందర దమవచ్చిన వంకన తిరిగి యరుగ సాగిరి. కిరీటి యట్లరుగుచుండిన వారింగని శంఖరవజ్యానాదంబులు సెలంగ గొండొకదవ్వు వెన్నడించితమి తృప్తింబొంది మరలువాఁడై తొల్లవారును విసం బెడ్డమొలుంగునం బోయు

వచ్చెదనని చెప్పి, గాంగేయ ద్రోణ కృపాచార్యులకుఁ బ్రణామబాణంబులేసి వారి వీడ్కొనినవాఁడై మెఱయు నపుడు కౌరవవీరులతనిం దేఱి చూడనుంజాలక చనిరి.

ధనంజయుండు "భూమింజయా! పసులు మరలెను. శత్రుబలములు పిఱుఁగు పెంటలయ్యె. రాజులుఁ బెద్దదొర లును సిగ్గఱి బిరుదులు వైచిరి. ఇఁక మన మేల వెనుకకుఁ బోఁగూడదు? మీయమ్మయు బందుగులును నీకొఱకెదురు చూచుచుందురు. హయముల మరల్పు" మనియె. అంత నుత్తరుఁడు రథంబు మగిడింప మార్గమున నర్జునుఁడు కౌర వుల గెలిచి గోవులఁ దిరిగి తెచ్చుటెంతయు నీబాహుబలమున నని పలుకుమన నోయీపార్థా! ఈపనియంతయు నాచేఁ గాకుండినట్టులుఁగని వారెవరు? నేను జేసితి ననిన ప్రజలు నమ్ముదురా? యని యుత్తరుండు పలికె. ధాత్రీవల్లభుఁడు నిజము దెలిసికొనుమార్గము క్రమమున నీకుఁ దెలిపెదనని యర్జునుండు పలికి రథమును శమీవృక్షము సమీపమునకు నడపించెను. గాండీవాది సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్య పరికరంబుల సవినయంబునఁ బ్రార్థించి యంతర్ధానంబు నొందించి మొప్పటి సింహపతాకరథంబున బంధింపంబనిచె,

విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుండై వచ్చునట్లుగఁ జేసి తొంటిచందంబునఁ దలచీర యలవరించి కొని సారథియై సవ్యసాచి నొగలెక్కె. అట్టిసమయంబునఁ బురందరాది బృందారకులును దేవముని సిద్ధ గంధర్వాదులును పాండుప్రముఖ రాజలోకంబును నాశ్చర్య హర్షాయత్త చిత్తులై సమరవిషయంబులైన మాటలాడుచు నిజవాసంబుల కరిగిరి.



# సైంధవుఁడు.

ఇతఁడు సింధుదేశాధిపతియగు వృద్ధక్షత్త్రుని కుమారుఁడు. ధృతరాష్ట్రుని కుమార్తెయగు దుస్సలను వివాహమాడెను. చిన్నతనమున నితఁడాడుకొనుచుండఁగ యుద్ధమున నేమఱియుండునపుడు చనిపోవునని యాకాశవాణి పలికెను. ఆమాటలు వృద్ధక్షత్త్రుఁడు విని తన కుమారుఁడిట్లగునాయని చింతించి యెవ్వఁడీతని తల నేలఁబడవేయునో వాని శిరము నూఱుముక్కలగుఁగాక యని శపించెను. ఈశాపము కృష్ణునకుఁ దెలియును.

ఒకసమయమునఁ బాండవులు వేఁటకేగుచు ద్రౌపదిని తృణబిందు నాశ్రమమున నుంచి పోయిరి. మార్గమునఁ బోయెడు సైంధవుఁడామెంజూచి తన్ను వివాహము చేసికొనుమని కోరెను. అంత ద్రౌపది కడుంగడు చింతించి వానితో "అన్నా! నీకిది బొత్తుగా తగనిపని. నీవు నాకు సోదరుఁడవు. అదియునుంగాక నేను వివాహితను. నాపతుల కీవృత్తాంతము దెలిసిన నీకు కీడు దప్పక వాటిల్లు" నని నయభయముల బోధించెను. కాని యాతఁడు గామంబున నొడలు దెలియక యామెను గొంగుఁబట్టి లాగెను. అంత ద్రౌపది

వానిఁ ద్రోచినఁ గ్రిందఁ బడియు లేచి యామెను దన రథమునఁ గూర్చుండఁబెట్టి తోలుకొని పోవుచుండెను.

వేఁటనుండి పాండవులు తిరిగి వచ్చినపుడు తృణబిందువాశ్రమమున నామె లేమింజేసి చింతనొందుచుండిరి. పరిచారికలలో నొకరిత వారి విచారమును జూచి సహింపఁ జాలక, సైంధవుఁడు ద్రౌపది నపహరించుకొని పోయెనని చెప్పెను. పాండవులు సైంధవుని వెన్నంటి తఱిమి వానితోఁ బోరాడి యోడించి ద్రౌపదిని దీసికొని, వానినిఁ దమ రథమునకుఁ గట్టి తీసికొనివచ్చి సంహరింపఁబోయిరి. కాని దయాళుఁడగు ధర్మజునాజ్ఞచే నీతనిఁజంపక, వీని శిరమును గొఱిగి యవమానపఱచి పంపిరి.

ఈపరాభవమున కాతని దుఃఖ మెక్కువయై పాండవుల నెట్లు తిరిగి పరాభవ పరతునాయని తలపోసి గంగయొడ్డును జేరి శివునిగూర్చి తపము సేయ నారంభించెను. కొంతకాలము జరిగిన పిమ్మట మహేశ్వరుఁడు ప్రత్యక్షమై నీవేమికోరెదవని యడుగ సైంధవుఁడు, తన్ను పరిభవించిన పాండవులను రణమునఁ దాగెల్చునట్లు వరమిమ్మని కోరెను. అర్జునుని గాక మిగిలినవారి నొక్క దినమున మాత్రము గెలుచునట్లు వరమొసంగి శివుఁ డంతర్ధానమందెను.

ఇట్లుండఁ గొంతకాలమునకుఁ గురు పాండవులకు సంగ్రామము సంప్రాప్తమయ్యె. ఆయుద్ధమున కౌరవ సర్వసేనాధిపతియగు ద్రోణాచార్యుఁడు తన సేనలను శత్రులెవరును భేదించుట కశక్యముగానుండు పద్మమువంటి వ్యూహముగ నేర్పరచెను. ఆవ్యూహమున ననేక దేశపు రాజులను వారి సైన్యంబులను కింజల్కములుగ నిలిపె. మఱియు నావ్యూహంబునకు తామరదుంపవలె దుర్యోధనుండును, ముఖద్వారంబున ద్రోణుఁడును, చుట్టును సైంధవుఁడు కృపాచార్యుఁడు అశ్వత్థామ శకుని కృతవర్మఁడు భూరిశ్రవుఁడు శల్యుఁడు దుశ్శాసనుఁడు మొదలగువారును నిలిచియుండిరి.

అపుడర్జునుఁడు వేఱొకచోఁ బోరుచుండుటచే భీమసేనుని ముందుంచుకొని సాత్యకి ధృష్టద్యుమ్నుఁడు నకుల సహదేవులు నుత్తమౌజశ్శిఖండియుధామన్యులును ఘటోత్కచ విరాట ద్రుపదులును ద్రౌపదేయ కేకయ సృంజయ సముదయంబు నొక్కపెట్టున ద్రోణునిపైకి వచ్చియుండిరి. ద్రోణుఁడు నవ్వు ముఖమున బహు క్రూర బాణంబులఁ బ్రయోగించి తన సామర్థ్యమును జూపఁ బాండవ రథికులందఱు నిలువఁ జాలక చెదిరి కలగ ద్రొక్కకొనుచు తెల్లముఖముల నుండిరి. ధర్మరాజిది యంతయుఁ జూచి కొంత సేపూరకయుండి యభిమన్యునితో "నాయనా! ఈవ్యూహము భేదింప నర్జునుఁడు నీవు నచ్యుతుఁడు బ్రద్యుమ్నుఁడుం

దక్కు నోరులు చాలరు. గనుక నీవు దీనిని భేదించి మా కుం బ్రియమొనర్పు" మని చెప్పెను.

అభిమన్యుఁడు ధర్మజుం జూచి సంతోషముతో "పద్మ వ్యూహము భేదించు తెఱంగు మాతండ్రి నేర్పియుండెను గాన నేను దానిం జొచ్చి చించి చెండాడఁ గాని సైన్యము నను జుట్టినపుడు వెడలునట్టి యుపాయము నెఱుంగ" నని చెప్పెను. అంత భీముఁడు, "పార్థనందనా! నీవు తెఱపిగొని సొచ్చిన నీవెంట పార్షతుఁడు, నేను, ద్రుపదుఁడు, విరటుఁడు మొదలగు వారందఱము వచ్చి శత్రునాశనము గావించెదము. నిన్నొంటిగ విడుతుమా! నీవు సందియము వదిలి వ్యూహమున జొరు" మని ప్రోత్సహించెను. అభిమన్యుఁడు మంచిదని యొప్పుకొని తన సారథిం గనుంగొని మనరథమును ద్రోణానీకంబుపైఁ బఱపుమనియె. అంత సారథి యర్జున పుత్రుంజూచి నీవు చుక్కవచ్చలారని బాలుఁడవు. ద్రోణుఁడు మొదలగు మహావీరు లీబవరమునకు వచ్చియున్నవారు. అట్టి వీరులు బాలుఁడవును, అనుభవ హీనుఁడవునగు నీచేఁ జచ్చెదరను కొనదవేమొ. దీనిం జొరక పూర్వము కొంచెమాలోచించుమని చెప్పెను. అభిమన్యుఁడు నవ్వి ద్రోణునేకాదు స్థాణునైన జయింతునని పలికి యభేద్యంబగు నా పద్మవ్యూహంబు భేదించి జొచ్చి రౌద్రరసోల్లసిత మూర్తియై యుద్ధము సేయుచుండెను. వ్యూహమునఁ జొరఁబడునపు డభిమన్యు

నకు సాయపడ వెంబడించిన భీమాదులను పురారివరమున దుర్జయుండగు జయద్రథు డడ్డగించి సాత్యకిని సాయకత్రయమునను భీమసేనుని బాణాష్టకంబునను, ధృష్టద్యుమ్నుని నిరువది యమ్ములను, విరాటుని శిఖండిని బదిపది తూపులను బాంచాలపతి నేడింటను, ద్రౌపదేయులం బదియేనింటను, కేకయుల నిరువదేనిటను, ధర్మసూను సప్తతిశరంబులను నేసి యాసేన నానాస్త్రంబులఁ గప్పె నొక యడుగైన ముందుకుఁ బోఁజాలక వ్యూహమునకు నీవలఁ బోరాడుచుండిరి. వ్యూహముం జొచ్చిన యభిమన్యునిపై ద్రోణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుఁడు, దుర్యోధనుఁడు మొదలగు కురువీరులెల్ల రొక్కసారి గవిసిరి. ఇతం డొకఁడే యందఱ కన్నిరూపులతో నిటు ద్రోణునిపై నటు కర్ణునిపై నిటు కృతవర్మాదులపై బాణములు వేయఁ జొచ్చెను. ఈతని బాణముల వలన దుర్యోధన సూనుండగు లక్ష్మణుఁడు మృతిఁజెందె. దుశ్శాసనుఁడు పారిపోయె.

ఇట్లు కొందఱఁ బారద్రోలియుఁ గొందఱఁ జంపియుఁ గొందఱ మూర్ఛితులం జేసియుఁ దుదకు దుర్యోధనునిపైఁ గవిసెను. కర్ణుఁడు చూచి ద్రోణునితో 'ఆచార్యా! అభిమన్యుఁడు కౌరవసైన్యమును బహువిధముల నశింపఁజేసి దుర్యోధనుని ప్రక్కకు వచ్చుచున్నాఁడు. ఇట్టితరుణమున నీవూరకుండక వాని గెలుచు నుపాయము వెదకు'మని చెప్పి తా దుర్యోధను

నకు సాయముగ నభిమన్యునిపైకి బోవుటకు సాహసించెను. అంత ద్రోణుండు కర్ణునితో నేను బోధించిన కవచధారణమను మహావిద్య నర్జునునివలన నీతఁడు గ్రహించెను. ఆవిద్య వీని యందుండుటచే న్యాయంబుగ నెవరును వీనిని గెలువఁజాలరు. మోసముచే వీనిని జయింపవలయును. అనిపలుక కర్ణుఁడు మహాభయము జెందినవానివలె వెనుకకు మరలి సేనాసహితముఁగ వెనుకనుండి చుట్టివచ్చెను. అప్పుడు కుంభజుఁడు వెనుకనుండి సౌభద్రునివిల్లు విరుగనేసె. కర్ణుఁడు హయంబులఁ జదిపె. దుశ్శాసనుఁడు సారథిఁ బొడవడంచె. విరథుఁడై యసహాయుండగు నభిమన్యుఁ డోపినంతవరకు నరిబలంబులోఁ బోరాడి వీరస్వర్గమలంకరించె.

అర్జునుఁడువచ్చి తనకుమారుఁడెట్లు చనిపోయెనని ధర్మజునడుగ నీవుసంశప్తకహననమునకుండ ద్రోణుండీచట పద్మవ్యూహము నేర్పరచెను. దాని భేదింప నేరికి శక్యంబుగా దని యభిమన్యుంజేరి నీవీవ్యూహమును జొచ్చి భేదింపుము నిన్నొంటరిగ విడువక మేము నీవెంటవచ్చి శత్రునాశము గావించెదమని పలికితిని. నాయుపదేశమున నాతండట్లు చొచ్చి సైన్యమును చిందరవందర చేయుచునుండ మేము వానిం జేర గమకించితిమి. మార్గమున సైంధవుఁ డడ్డుకొని మము వానిఁ జేరనీయఁడాయెను. కౌరవసైన్యంబంత వానినొంటరిగఁ

జూచి విరథుం జేసి సంహారించెను. అభిమన్యు సంహారమునకు సైంధవుఁడే కారణ"మని ధర్మజుఁడు చెప్పెను.

తన సుతుని చావు విని యర్జునుఁడు మూర్ఛిల్లి కృష్ణ యుధిష్ఠిరుల కరతలంబుల నెత్త నొక్కింత సేపునకు సేద దేఱి సైంధవుం దలఁచి తన యన్నతో

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీ నాథులుం సింధురా
జు నవశ్యంబును నెల్లి చంపుదు భయస్థుండై నినుం జొచ్చినం
వనజాక్షుం శరణంబు వేఁడినను గర్వంబేది నన్నుందగం
గనినం బోరుదొలంగిపోయిన నెఱుంగంగాని సత్యవ్రతా.

మఱియు

చ. అనిమిషదైత్య కింపురుషులాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంకకుండ మీ
న్నరవరేణ్య యిత్తెఱఁగు నాకొనరింపఁగ రాకయున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోఁ.

అని ప్రతిజ్ఞ యొనరించెను.

సైంధవుఁడీ సమాచారము చారులవలనఁ దెలిసికొని దుఃఖమున దుర్యోధనుని సమీపించి తన కుమారుని మరణము విషయమున నేనొకరుండ నగ్గొనరించితని యనుకొనుచు ఫల్గునుఁడు నన్ను వధింప బ్రతినఁ బూని యున్నవాఁడు. ఇది యేమిన్యాయము. నేనతనికి గానరాక తొలంగవలయుఁ గాని సురాసుర సిద్ధసాధ్యులైనను, వాని ప్రతిజ్ఞ కడ్డువడువారు కారు. కావున మీయందఱిచేత ననుజ్ఞాతుండనై పోయి వచ్చెదనని గడగడ వడకుచు మనంబు గొందలపడ బలికెను.

అంత దుర్యోధనుఁడు సైంధవా! మన బలంబున విక్రమాఢ్యులగు ద్రోణుఁడు సౌబలుఁడు సోమదత్తుఁడు శల్యుఁడు మొదలగు వారుండగా నర్జునుఁడు వచ్చి నిన్నెట్లు సంహరించును? అదియట్లుండ నేను గలుగ నీవా సవ్యసాచికి వెఱవవలదు. మద్భాణంబుల మఱువుననున్న నిన్ను దేవతలకుం దేఱిచూడరాదు. విపచ్చునకుం బ్రవేశింపరాని బంధుర వ్యూహంబు పన్నించెద. కులధర్మంబు శిథిలంబుగాకుండ సమరంబు సేయుము. అని యూరడిల్లఁ బలికిన విని జయద్రథుండు గలంకుదేఱి సంగ్రామోత్సాహంబున నుండెను.

ఆసమయంబున కుంభసంభవుండు సైంధవుం గనుంగొని నీవును భూరిశ్రవుండును కర్ణుండును శల్యుండును నశ్వ

త్థామయు వృషసేనుండును కృపాచార్యుండును గూడుకొని యుండుడు. మన బలంబులలో మేలైన పదునాలుగు వేలేనుంగులను నఱువదివేలు రథంబులను లక్ష గుఱ్ఱంబులను బదిలక్షలు బదాతులను గైకొనుఁడు. నాతీర్చు వ్యూహంబునకు యోజనత్రయ మాత్రప్రదేశంబునం బిఱిఁది దెస బలసి నిలువుండు. అట్లైన నిన్ను దేవతలకుం జేరిచూడ రాదు. పాండవు లెంతటివారు? అని ద్వాదశ గవ్యూతి దీర్ఘంబును బంచగవ్యూతి విస్తృతంబునుగా శకటవ్యూహంబు నమకట్టి, దానికిఁ బశ్చిమార్ధంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబు పన్నించి, తన్మధ్యంబు మొదలుకొని యోలిన సేనాముఖంబు దెసకుం జాలినిగుడునట్లుగా సూచీవ్యూహంబుగావించి, సూచీముఖంబునం గృతవర్మయు నట పిఱుందం గాంభోజరాజును మఱియు బిఱుసైన వాపులైన శతసహస్రయోధుల మున్నిడికొని కురురాజును సూచీ మూల స్థానంబున నేరికిఁ గానరాకుండ బూర్వోక్త ప్రకారంబున నా జయద్రథుండును నిలుచునట్లుగ నొనర్చిరి.

ఇట్లు జరుగుచుండగ సూర్యాస్తమయ సమయంబాసన్నంబయ్యె. ప్రొద్దుగ్రుంకు లోపున సైంధవుని జంపలేక

పోయిన నర్జునుఁ డాత్మహత్య గావించుకొను శపథము నెఱిం
గి శ్రీకృష్ణుండు సవ్యసాచింజూచి "ఇనుఁడు పశ్చిమ ధరా
ధరంబు సేరఁబోయె. ఒక యుపాయమేను గల్పించెద. దానఁ
జేసి కాని సైంధవుఁడు కనిపింపఁడు. అది యెయ్యది యంటేని
యినమండలంబు మఱువడఁ దమము నొనరించెద. అపుడు
సూర్యుఁడు గ్రుంకిన చందమ్మై సైంధవుఁడును కౌరవయో
ధులు నతి సంతోషమున బ్రతిజ్ఞాభంగం బయ్యెనని కయ్యం
బు కడఁకదక్కి విచ్చలవిడి నొండొరుల మెచ్చుచుఁ బొంగి
చెలంగుదురు. అపుడు నీపూనికి దీర్చికొమ్ము" అని చెప్పి
మాయాతిమిరముఁ గల్పించెను. అపుడు కౌరవ సైన్యమం
తయు, ప్రొద్దు గ్రుంకి చీకటి పడినట్లుండ సైంధవుఁడు సంతో
షమునఁ దలయెత్తి చూచుచుండెను. సైంధవుని జూపి
కృష్ణుఁడు పార్థునితో "అదుగో సైంధవుఁడు. తేరిమీఁద నిలు
చుండి పడమర నఱ్ఱెత్తి చూచుచున్నవాఁడు. తడవుసేయక
వాని శిరమును ఖండింపు" మని పలికెను.

అంత నర్జునుఁ డాతనిఁ గని గంధమాల్యార్చితమై
మెఱయుచున్న శితశరము నేయ నది సైంధవుని శిరమును
డేగ పులుఁగును గఱిఁగొను క్రియ హరించెను. అపుడు కృష్ణుఁ
డు పార్థునితో తొందఱగా సైంధవుని తల యిలఁబడనీయక

సభంబున నిలుపుమని తెలుప నాతండు తన బాణములచే నాశిరమును డావటికి వలపటికి నవరభాగమునకు ముందుకు బంతివలె నడుపుఁజొచ్చెను. అంత మాయపుఁజీకటి విరియుడు సూర్యుఁడు గనిపించెను. కౌరవసైన్యము వారి యాయుధ ములఁ బూని యర్జునునిపై గవిసిరి. వారినెల్ల ధీరంబున నది లించుచు సైంధవుని శిరముగుతించి మఱవని కిరీటి శ్రీకృష్ణుం జూచి యెంతవరకిట్లీశిర మాకసమున నిలుపవలసి యుండు నని యడిగెను.

శ్రీకృష్ణుం "డోయీ ఫల్గునా! వృద్ధక్షత్రుండను సింధుదేశాధీశుండు తపోవిశేషంబున జయద్రథుం బడసె. ఇతం డు కుమారుఁడై వర్తిల్లునపుడు నొక్కనాఁ డశరీరవాణి వీఁడు సంగ్రామంబున నేమటి తల దునుమం బడునని పలి కెను. వృద్ధక్షత్రుఁడిది విని తాను దపము చేసి కనిన పుత్రున కిట్లగుటకు మిక్కిలి విచారించి దుఃఖముతో నెవఁడీతని తల నేలఁగూల్చునో వాని తల నూఱువ్రయ్యలగుఁగాక యని శపించెను. కావున నిత్తల పుడమిని బడనీక వృద్ధక్షత్రుని తొడమీఁదఁ బడునట్లు చేయుము. ఈపని నీపాశుపతాస్త్రము మాత్రమే చేయఁగల" దని చెప్పెను.

అర్జునుం డట్లుకాక యని భక్తియుక్తంబుగా నియుక్ తుతిం దత్ప్రయోగం బాచరించిన నద్దివ్య సాధనంబు సా

యక పరంపరాకారంబై యాశిరంబుగొని శమంత పంచక సమీపంబునకుం జని యజ్జనపతి జపయుక్తుండై యుండ నమ్మహాస్త్రంబు మహాత్మ్యంబున నమ్మస్తకంబతని తొడ మీఁదఁబడియె. అతండు దదీయ స్పర్శనంబున నులికిపడి దిగ్గన లేచుచు శిరంబుం బోద్రోచిన నది భూతలపతితం బగుటయు నాతని తల పగిలి నూఱుప్రక్కలయ్యె.

ఈవిధమున శౌరి విజయుని ప్రతిన నెగ్గించి సైంధవు నంతము నొందించెను.



# గోవా వర్తకుఁడు.

భరతఖండమునం దరేబియాసముద్రతీరమున గోవా యను నొక పట్టణము గలదు. పూర్వకాలమునం దచటకు సమీపదేశములనుండి వర్తకులు వచ్చి స్థిరవసతు లేర్పరచుకొని వారి వారి వ్యాపారములఁ జక్కఁబెట్టుకొనుచుండెడివారు. అట్టివారిలో నొకఁడగు హాఫిజూనుఁ డనెడి చైనా వర్తకుఁడు హిందూవర్తకులకు స్థిరాస్తి తనఖామీఁదను, చరాస్తి తాకట్టుమీఁద నెక్కువ వడ్డికి బదులిచ్చి యపరిమితముగ ద్రవ్యము గడించెను. ఇతఁడు మిగుల కఠిన హృదయుఁడై తానప్పిచ్చిన వారి యొద్ద క్రూరముగ ధనము రాబట్టుచు దౌర్భాగ్యులైన వారి కందఱికిని యనిష్టముగ నుండెను. ఆకాలమున నచట జయరావనెడి యొక హైందవ వర్తకుఁడు గలఁడు. ఆతఁడు మిగుల న్యాయశీలుఁడును, కపటములేని వాఁడును, దయాళుఁడును, సంపన్నుఁడును, పరోపకారమొనరించు నపుడు ముందంజ వేయువాఁడునై యుండెను.

ఆతఁ డాపదలోనున్న వారికి ఋణము లిచ్చుచు, వారి వద్ద నెన్నడు వడ్డిని పుచ్చుకొనువాఁడు కాఁడు. కాబట్టి లుబ్ధా

గోసరుఁడగు హాఫిఝానునకును దానశీలుండగు జయరావు కును శతృత్వము రగుల్కొనెను. ఇతఁడు లోభము గనిన వానిని బహిరంగముగ మందలించునుగాని చాటున నితరుల కడ, వానిని గురించి లేనిపోనివి పలుక నొల్లడు కావున వర్తకశాలలందు గాక మార్గమున నెచట హాఫిఝాను కన బడినను వాని నిర్దయను ధనాకర్షణమునకై ప్రయోగించు నిర్బంధములను బలికి తన యెదుటనే వానిని దూషింపుచుం డెను. లోపమును దెలిసియుండిన హాఫియానుఁడు మాటువలు కక యతిశాంతునివలె నటించుచు లోలోపల గోతులఁ ద్రవ్వ నాలోచించు చుండెను.

జయరావునకు 'నారాయణరావు' అనెడి యొక ప్రియ మిత్రుఁడుండెను. ఇతఁడు పూర్వపు జాగీరుదారుల వంశమున జన్మించి శుభకార్యములు మొదలగు వానియం దాదాయ మునకు మీరిన వ్యయము చేయుచు నల్పకాలమున తన ధన మంతయు వెచ్చపెట్టెను. వీరిరువుర మైత్రిం జూడ వీరి దేహ ములు వేఱుగాని ప్రాణము లొకటియై యున్నట్టు కనఁ బడు చుండెను.

ఒకనాఁడు నారాయణరావు జయరావువద్దకువచ్చి "ప్రియమిత్రమా! స్నేహితుఁడైనయొకధనవంతుని కుమారితను వివాహముచేసికొని మరల భాగ్యవంతుఁడను గావలెనని నా

కు వాంఛగలదు. ఆమిత్రుఁడు చనిపోవుకాలమున తనకొమ రితకు విశేషధనమిచ్చియుండెను. చిన్నది మాయింటికిఁ బలు మారుపచ్చుచు నన్ను వివాహముచేసికొను నుద్దేశమును వెలిబుచ్చుచుండెను. ధనవంతురాలిని వివాహముచేసికొను టకు పెండ్లికూఁతువారితో సరితూఁగఁజాలిన స్థితి నాకిప్పుడులేదు. చిన్నది పదునెనిమిదిసంవత్సరముల వయసునన్నది. ఈలెరు ణము దాటిన సంబంధము దాటిపోవును. గనుక దయయుంచి రెండువేలవరహాలను బదులి" మ్మని ప్రార్థించెను. జయ రావునకుఁ దనమిత్రుని మనోరథము నీడేర్చవలయునని తలం పుగలదుగాని, తనవద్ద సాధనమాసిద్ధముగ లేకపోవుటచే నా రాయణరావును వెంటఁగొని వాఘిరాముసువద్దకుఁబోయి "ఓ యీ! నాకు రెండువేలవరహాలు బదులుకావలసియున్నవి. ఏడెనుసగరమునుండివచ్చుచుండిన నాయోడలలోని సరకుల విక్రయించిన వెంటనే నీఋణమును వడ్డితోఁగూడదీర్చివేసెద నీమవసువచ్చినవడ్డినిర్ణయించుకొని బదులిచ్చి యీయవసరము దీర్పు" మని యడిగెను.

ఏలాగునైన జయరావును చేతిలోఁజిక్కించుకొని పూ ర్వద్వేషమును వడ్డితోఁగూడ దీర్చుకొనవలయునని తలఁచి "యోస్నేహితుడా! నీవు సాధనవ్యాపారములగురించి నన్ను చటచటను వర్తకశాలలందు ననేకపర్యాయములు దూషించి యుంటివి. అదిమఱచితివా? పోనిమ్మా. నీవేమిచేసినను నీతోఁ

జెలిమి చేసికొని నీదయను సంపాదించవలెనని వాకొంటిని. నీవద్ద చిల్లిగవ్వయైన వడ్డిగైకొనక నీకుఁగావలసిన పైకమిచ్చి నీయవసరమును దీర్చెద"నని చెప్పి లోనికిఁబోయి ద్రవ్యమును దెచ్చి జయరావును వెంటఁగొని యొకన్యాయవాదియొద్దకు వచ్చి యాతనియెదుట, నియమితకాలములోపున ఋణమును దీర్పలేకపోయినచో జయరావు హృదయమునుండి యొకసేరు మాంసమును షాఫియానుడు దీసికొనునట్లొకపత్రము వ్రాయించి సంతకముచేసి యీయవలయునని కోరెను. తన్ను గుఱించి వ్రాయఁబడిన యీపత్రమున నీనిర్బంధపు షరతుతో సంతకముచేయవలదని నారాయణరావు పట్టుకట్టినను జయరా వాతనిమాటలు పెడచెవిని బెట్టి నియమితకాలమునకు పూర్వమునఁ దన యోడలువచ్చి చేరును గావున నసలు ఫాయిదాలు కంటె నెక్కువగ నిచ్చెదనని తలఁచి పత్రముపైన సంతకముచేసి యిచ్చి రెండువేలవరహాలు తీసికొని నారాయణరావునకిచ్చి వేసెను.

నారాయణరావు వివాహముచేసికొన యత్నించుచుండిన భాగ్యవంతురాలి వాసస్థలము గోవానగరమున కీశాన్యమూలను నూమారు పదిమైళ్ళదూరమున నుండిన కనకదుర్గమను పట్టణము. పెండ్లికూతురుపేరు కళావతి. ఆమె తల్లిదండ్రుల మంచిశిక్షలోఁబెరిగి సద్వర్తనము నేర్చుకొనియుండెను.

విద్యాబుద్ధులందును రూపగుణసంపదలందు వానితోసమాను లులేరు. జయరావు తనచెలికాఁడగు నారాయణరావు నిమిత్తమై హాఫిజూనుని కోరితెచ్చి ధనసహాయము చేసినందున నారాయణరావు సకుటుంబసపరివారముగ మహావైభవముతోఁ దరలివెళ్ళి తనమిత్రుఁడగు జయరావుతోఁ గనకదుర్గము చేరెను.

ఈయుద్వాహమునకుఁ బెండ్లికుమారునిపక్షమున నాతనిస్నేహితుఁడగు వామనరావును పెండ్లికూతురువారిపక్షమున కళావతి చెలికత్తెయగు సునందయువచ్చియుండిరి. నారాయణరా వన్ని విధములఁ దనకుఁదగిన వరుఁడని గ్రహించి కళావతి యిసుమంతయు నాలస్యముసేయక యాతనిఁ దన నాథునిగాఁ బరిగ్రహింపనొడఁబడియె.

నారాయణరావు తనస్థితినెంతయుఁ గప్పిపుచ్చక తాను విశేషధనవంతుఁడఁ గానని యు సుప్రసిద్ధులగు జాగీరుదారుల వంశమునఁ బుట్టినందునఁ గలిగిన యాధిక్యముతప్ప మఱియొక యాధిక్యమేమియు లేదనియు నొప్పుకొనెను. కళావతి నారాయణరావువంకఁజూచి "ప్రాణనాథా! నన్నును నా యైశ్వర్యమును మీకు నర్పించితి" నాదివ్యభవనమునకు నా భృత్యవర్గమునకు నిదిమొదలుగ మిమ్ము నధికారులుగఁజేసితి.

ఈబటువుతోఁగూడ నాపాణిగ్రహణముఁ జేయుఁడని తన యుంగరమునుదీసి విభుని చేతికిచ్చెను.

తనవంటి యల్పస్థితివంతుని ధనాఢ్యురాలగు కళావతి వరిగ్రహించినరీతిఁజూచి యద్భుతప్రమోదమగ్నమానసుఁడై యుంగరమును చేతనందుకొని తాను దాని నెన్నడు నెడఁబాయనని వాగ్దానముచేసెను.

వామనరావును సునందయును నీమహోత్సవముదగ్గఱ నుండిచూచుచు నారాయణరావును కళావతిభర్తనుగాఁ జేకొనెదననినపుడు వధూవరుల నిద్దఱ నాశీర్వదించిరి. మఱియు వామనరావు సునందయు నొండొరుల రూపలావణ్యములు గమనించి వివాహమాడుటకు హృదయపూర్వకముగ నొప్పుకొన యామహూర్తముననే తానుకూడ వివాహము చేసికొనుట కనుజ్ఞయొసఁగుడని నారాయణరావు నడిగెను. ఇపుడు నీవు భార్యను సంపాదించుకొనగలిగినచో నీవివాహముకూడ నిపుడు జరుగుట పరమసంతోషమని పలికెను.

అంత వామనసింగు తనకు సునందపైఁ బ్రేమగలదని యు తనను భర్తగా గైకొనుట కామెయంగీకరించెననియుఁ జెప్పెను. అంత కళావతి యీమాట వాస్తవమేనా యని యడుగ సునంద నీకంగీకారమైనచో నాకునంగీకారమేయని

బములు చెప్పెను. రెండు వివాహకార్యములు నొక్క సుము హూర్తమువనే జరిగెను. ఇట్లు నూతనదంపతు లతిసౌఖ్యమున నుండిరి. బంధుగులందఱు నెవరియిండ్లకు వారుపోయిచేరిరి. పదహారురోజులపండుగ రాకపూర్వమే గోవానుండి జయ రావు వ్రాసిన పిడుగువంటి దుర్వార్తగల యొకజాబువచ్చి నూతనవధూవరుల యానందమునకు భంగముగలిగించెను. ఆ యుత్తరమును నారాయణరావు తీసికొనిచదివి తెల్లబోయి వడవడవడకుచుండగా మిత్రులలో నెవరైన మృతులైయుం డిరా? యని కళావతి భయపడఁజొచ్చెను. జాబులోని విష యము లెట్టిదని యడుగగా "నాస్థితిగతులు మఱుఁగుపర చక "మొట్టమొదట నీతోఁ జెప్పియుంటిని. అంతియకాక నా వివాహపుఖర్చునకు జయరావును ఋణమిప్పించుమని నేను కోరగా నాతనివద్ద సొమ్ము లేకపోవుటచే హాఫిజూనునొద్ద యప్పుఁజేసి గడువునాటికి ఋణము తీర్చనిచోఁ దన హృదయ ములోని మాంసమునుండి యొకశేరుమాంసము హాఫిజూనుఁ డు దీసికొనునట్లు పత్రమువ్రాసి సొమ్ముతెచ్చి నాకిచ్చియుం డెను. ఏడెనురేవునుండి సరకులతోవచ్చి చేరుననియెంచియుం డిన యోడలు మునిగిపోయినవి. నానిమిత్తమై తెచ్చిన యా సొమ్ము తీర్చలేకపోవుటయు జయరావు హృదయమునుండి హాఫిజూనుఁడు శేరుమాంసము గోయుటయు జయరావు చని పోవుటయు నిశ్చయము"నిచెప్పెను. కళావతి "ప్రాణేశ్వరా! విచారించకయు నాలస్యముచేయక మిత్రరక్షణార్థము పొండు,

మీామరాలమున మీాప్రియమిత్రున కావద రాకమున్న యీా తఁడు బాకిపడియున్నధనముకంటె నెన్నిమడుగులైనను గొని పోయి విడిపించుకొనిరండు. ఈవిషయమున మీామనసువచ్చి నంతధనమును వినియోగింప మీాకు సర్వాధికారము నిచ్చు చుంటి"నని చెప్పెను.

ఉత్తరమువచ్చిన మఱుచటి దినమున నారాయణ రావు వామనరావు బయలుదేఱి యతివేగమున గోవాపట్టణ మును బ్రవేశించి యందు జయరావు కారాగృహవాసమున నుండినవార్తను గుండెలు పగులునట్లువినిరి. అతని కారా గృహవిముక్తునిజేయుటకు వలసినంతధనమును దీసికొనిపోయి నను దయాశూన్యుఁడగు హాఫిజూనుఁడు సొమ్మిచ్చుటకై యిచ్చిపెట్టినకాలము గడచిపోయెనను మిషపై తీసికొనుట కంగీ కరింపక జయరావుయొక్క హృదయమునుండి శేరుమాంసమే కావలయునని మూర్ఖపుపట్టుపట్టియుండెను. ఈఘోరవ్యాపార ము విమర్శించుటకు గోవానగర న్యాయాధిపతి యొకదినము నిర్ణయించెను.

కళావతి తనభర్తను బంపినపుడు మీాప్రియమిత్రుని దప్పక విడిపించి తీసికొనిరావలయునని చెప్పియుండినను తా నేవిధముననైన తనవాథునియొక్క ప్రాణమిత్రుని రక్షించి విడిపించుటలో ముఖ్యురాలుగ నుండుటకు సాధనము గలదా

యని యాలోచించుచుఁ దుదకుఁ దాను గోవానగరమునకుఁ బోయి జయరావుపక్షమున వాదించవలెనని నిశ్చయించు కొనెను.

కళావతికి గోవాన్యాయసభను సేతూరావనుబంధుఁవు డొకండు న్యాయవాదిగనుండెను. అతనికామె తనపతియొక్క స్నేహితుని వ్యవహారపు స్వభావమును దెలుపుచు నొకలేఖ వ్రాసి యావిషయమై యాలోచన చెప్పుమనికోరుచు తాను బంపిన మనుష్యునిచేతికి న్యాయవాదులు తొడుగుకొనెడి గౌనులు మొదలగువానినిచ్చి పంపుమనికోరెను. సేతూరావు వద్దకుఁ బంపబడిన యాతఁడు దిరిగివచ్చునప్పుడు వ్యవహారము నడపింపవలసినచర్యగల నోటుబుక్కును గౌనులు మొదలగు దుస్తులను దెచ్చెను. తరువాత కళావతి తానును సునందయుఁ బురుషవేషములు వేసికొని న్యాయవాదులు తొడుగుకొనుగౌను దాను తొడుగుకొని సునందను తన లేఖరిగఁజేర్పఱచి తనవెంటఁదీసికొని ప్రయాణమై విచారణదినమునకు గోవానగరముకుఁబోయి చేరెను. గోవానగరపు న్యాయాధిపతి వాయిదానాఁడు సభదీర్చియుండగా వ్యవహారముయొక్క విమర్శ యారంభమగునపుడు కళావతి సభను బ్రవేశించి సేతూరావువద్దనుండివచ్చిన యొకయుత్తరమును న్యాయాధిపతికిచ్చెను. ఆయుత్తరమున సేతూరావున కీవ్యవహారమున వకాల్తునామాయున్నదనియు, తానువచ్చి వాదింపవలసియుం

డినను శరీరమునందస్వస్థతచే రాలేకపోతిననియు, రానందుకు తనను మన్నించి యీవాయిదాకుఁ దాను బంపిన చిన్నవానిఁ దనకు మారుగ నంగీకరించి యాతనివాదమును వినవలయు ననియునుండెను. ఆయుత్తరమును న్యాయాధికతి రికార్డుచేసి సేతూరావు ప్రార్థన మంగీకరించి జయరావుపక్షమున కళావతి వాదముచేయుటకు సమ్మతించెను. అంతట విచారణ ప్రారంభమాయెను. పురుషవేషముననున్న కళావతి వెనుక జయసింగు. నారాయణరావును, మోతీలాలనెడు న్యాయవాదివెనుక షాఫియాసును నిలఁబడియుండిరి. ఆసభయందు నారాయణరావు జయరావుయొక్క వకీలునుజూచియు నామె పురుషవేషమున నుండినందున బొత్తిగా నానవాలుపట్టలేక పోయెను.

ఆమె మొదట షాఫియాసునుజూచి "దస్తావేజుప్రకారము ననుసరించి యీతనికి జయరావుయొక్క హృదయమునుండి యొక శేరుమాంసమును బుచ్చుకొనుటకు చట్టమునుబట్టి హక్కుగలిగినటుల నొప్పుకొందును. దస్తావేజు ప్రకారమునుబట్టి షాఫియాసుడు జయరావుదేహమునుండి తనకు రావలసిన భాగమును దీసిన జయరావు మృతినొందుట నిశ్చయము. 'అహింసా పరమోధర్మః' యను న్యాయమునుబట్టి జీవహింసయేకిని దగనిపని. ఏహింసగాని చేయక సర్వభూతములందు దయాళువులై వర్తించువారికి స్వర్గము కరస్థము. భూతదయగలవాఁ

డేసర్వధర్మములు చేసినవాఁడు. అదిలేనివాఁడు సర్వధర్మములు చేసియు నేమియుఁ జేయనివాఁడె. కడపట దాను చేసిన ధర్మము తనకు సహాయమైవచ్చునుగాని తక్కినది యేదియు లోకములోనిది తోఁడరాఁబోదు." అనుమాటలతో షాఫియానుయొక్క కఠినహృదయము నొకటితప్ప యెటువంటి కఠినహృదయమైనను కరఁగునట్లు మృదుమధురవాక్యములతో సహింసామహిమను వర్ణించెను. పత్రములోని నిబంధనప్రకారముగ జరుగవలసినదనుమాటగాక మఱియేదియు నాతని నోటనుండి రాదయ్యె. పత్రమున వ్రాసినవిధమున నాతఁడు ధనము నియ్యలేఁడాయని కళావతి యడుగ జయరావు బదులుపుచ్చుకొనిన రెండువేలవరహాలుమాత్రముగాక షాఫియానుఁ డేమికోరిన నియ్య సిద్ధముగనుంటినని నారాయణరావు జవాబుచెప్పెను. తనకు సొమ్మక్కఱలేదనియు పత్రమున వ్రాసినమాంసము మాత్రమే కావలయుననియు షాఫియాను పట్టుదలతోఁ బలికెను.

అప్పుడు పత్రము నిటు తెమ్మని షాఫియాను నడిగిపుచ్చుకొని కళావతిచదివి యీపత్రమున వ్రాసినగడువు మీఱినది. దీనిఁబట్టి నీకు జయరావుహృదయమునుండి యొకశేరు మాంసమును గోసిపుచ్చుకొనుట చట్టసమ్మతమై యున్నది. ఆయినను దయయుంచి సొమ్మును దీసికొని పత్రమును రద్దుపరచుటకు సెలవిమ్మనియడిగెను. క్రూరాత్ముండగు షాఫి

యూసుఁ కామాట లెంతయు రుచింపమి నామనోనిశ్చయము నెంతయు మార్పజాలనని దృఢముగఁ బలికెను. కళావతి జయరావునుజూచి యీతని మనసు నేనునుజూనును రంజింపఁ జాలదు. ఇఁక నీహృదయమునుండి శేరుమాంసము నిచ్చుటకు సిద్ధముగ నుండవలసినదేయని పలికెను. జయరావు నారాయణరావువంకఁదిరిగి మిత్రమా! నీహస్త మొకపర్యాయము నా చేతికిమ్ము. నీవు సకలశుభముల బొందుదువుగాక! నీకొఱకు నాకీ విపత్తువచ్చినదని నీవెంతయుఁ జింతింపఁ వలదని చెప్పెను. ఇంతలో హాఫిజూను కాలము వ్యర్థపుచ్చనేటికి? అనుగ్రహించి వ్యవహారము పరిష్కరింపుడని యత్యాతురముగఁ కేకవేసెను. అపుడాసభనున్న వారందఱును నేమి జరుగునో యని విచారించుచు నిశ్శబ్దముగనుండిరి. ధర్మాత్ముఁడగు జయరావు విషయమై దుఃఖపడని వారొకరును లేరు.

కళావతి హాఫిజూనునుజూచి యోయీ! మాంసమును సరిగ తూచుటకు తక్కెడయుఁ దాయుయు భద్రపఱచితివా? నెత్తురు వెల్లువలై జయరావు మరణము పొందకుండ నొక వైద్యునిదగ్గఱనుంచుకొంటివా? అని యడిగెను. పత్రములో నాసంగతి వివరింపఁబడియుండలేదని హాఫిజూనుఁడు చెప్పెను. కళావతి “నాయనా! ఆప్రకారము పత్రములో వ్రాయఁబడని మాటవాస్తవమే. అయిననేమి? ధర్మార్థముగ నంతమాత్రము జేయుట నీకు శ్రేయస్కరముకాదా” అని యడిగెను. ఆప్రకా

రము పత్రమునలేదనినమాటలుగాక మఱియేమాటను శాఫియానుఁడు పలుకఁగలిగినవాఁడుకాఁడు. అపుడు కళావతి హృదయములోని యొకశేరుమాంసమునీది. నీవామాంసము నాతని హృదయమునుండియే కోసికొనవచ్చును. అందుకు ధర్మశాస్త్రమంగీకరించును.'' అని శాఫియానుతో నుడివెను. అతఁ డందుమీఁద సంతోషించి 'ఓ న్యాయవాదీ! నీవునిష్పక్షపాతముగలబుద్ధిశాలివి. ధర్మదేవతయే యీరూపమువనిటకేగుదెంచి తగవుఁ దీర్చుచున్నయది'' యని కత్తినినూఱి పదును చేయుచు జయరావునుజూచి రా! బాకిఋణముఁ దీర్పసిద్ధముగ నుండుమనిపలికెను.

కళావతి శాఫియానునుజూచి కొంచెమాగుము. నీకు మఱియొకమాట చెప్పవలసియున్నది. ఈదస్తావేజుప్రకారము నీకొక్కరక్తపుచుక్కకైన నధికారములేదు. ఒకశేరుమాంసమని స్పష్టముగ వ్రాయఁబడియున్నది. ఆమాంసమునునీవుకోసికొనినపుడొక రక్తపుచుక్కయైనఁ గ్రిందబడినయెడల ధర్మశాస్త్రముబట్టి నీచరస్థిరరూపమైన యావదాస్తియు గోవా ప్రభుత్వమువారికిఁబోవునని చెప్పెను.

జయరావు హృదయమునుండి యొకబొట్టయిన నెత్తురు రాకుండ నొకశేరుమాంసమునుగోసికొనుట మిక్కిలియసంభవము. దస్తావేజునందు వ్రాయబడినది మాంసముకాని నెత్తురు

కాదని బుద్ధిమంతులగు కళావతి చేసిన యర్థమువలన 'జయ రావునకు ప్రాణోపద్రవముదప్పెను. సర్వజనసంతోషదాయకముగ నట్టియుపాయమునాలోచించిన యాన్యాయవాదియొక్క బుద్ధికుశలత నెల్లవారును మెచ్చుకొని యద్భుతపడసాగిరి. సభామందిరపు నలుదెసలనుండియు నొక్కపెట్టున నభివందన వచనములు బయలువెడలి మిన్నుముట్టెను.

షాఫియానుఁడు తన దురుద్దేశము విఫలమాయెనని తెలిసికొని నిరుత్సాహము సూచించుచూపుతో కొంతసొమ్ము దీసికొనెదనని చెప్పెను. జయరావునకు ప్రాణరక్షణకలిఁగినందునకపరిమితానందమునొంది యిదిగో సొమ్మని నారాయణరావు కేకవేసెను. కళావతి యాతని నివారించి తొందరపడకుఁడు. ఈతఁడు మాంసము పుచ్చుకొనదగినవాఁడుగాని మఱియొక దాని పుచ్చుకొనదగినవాఁడుకాఁడు. షాఫియానుఁడా! మాంసము కోసికొనుటకు నీయత్నమున నీవుండుము. కాని నెత్తురు చుక్కయొకటియైనను పడకుండ జాగ్రత్తగనుండవలయును సుమా.

సేరు మాంసముకంటె నేమాత్రము నెక్కువకాని తక్కువకాని కోయఁగూడదు. మాంసము నందేమాత్రి మెక్కువ తక్కువలుండినను త్రాసేమాత్రము మొగ్గినను గోవానగర రాజశాసనమును బట్టి నీయాస్తి యంతయు దొర

తనమువారికిఁ జెందుటయగాక నీవు మరణదండనమును సహితము పొందవలసి వచ్చునని చెప్పెను. హాఫియానుఁడా మాటలు వినిపించుకొనక నాసొమ్మిచ్చివేసి నన్నుఁ బంపుమని యడిగెను. సొమ్ము సిద్ధముగనున్నది. తీసికొనుమని నారాయణరావీయఁబోయెను. ఆసొమ్మును హాఫియానుఁడు పుచ్చుకొనఁ బోవుచుండగ కళావతి ఓయి వర్తకుఁడా! ఆగు. నీవిపుడు నాచేతఁ జిక్కితివి. గోవా ధర్మశాస్త్రమును బట్టి యీ పురవాసి నొకని నిర్హేతుకముగఁ బ్రాణముదీయ యత్నించినందునకు నీయావదాస్తియు ప్రభుత్వమునకుఁ జేరుటయగాక నీప్రాణము సహితము న్యాయాధిపతి యనుగ్రహముపై నాధారపడియుండును. కావున నీవిపుడు న్యాయాధిపతి పాదములపైఁ బడి క్షమింపఁ బ్రార్థింపుమని చెప్పెను. అతఁడు దానికిఁ బ్రత్యుత్తరము చెప్పక మునుపే ప్రభువందుకొని క్షమింపుడని నీవు మమ్ము వేడకమునుపే నీకుఁ బ్రాణదానము చేసితిమి. సొమ్ము. నీయాస్తిలో సగము జయరావునకును దక్కినది హుజూరునకును బోవునని చెప్పెను.

జయరావును విడిపెట్టి ప్రభువు సభ చాలించినపుడు నారాయణరావు కళావతిం జూచి అయ్యా! నేనును నాప్రియమిత్రుఁడగు జయరావును మీ బుద్ధి చాతుర్యమున నేఁడు విపదాబ్ధినుండి తప్పించుకొని యావలఁ బడఁగలిగితిమి. ఈవ్యవహారమున మీరు చేసిన యుపకారమునకును, మీరు తీసి

కొనిన కష్టమునకును మేమెంతయిచ్చినను మీ ఋణము తీఱదు. అయినను చంద్రునకొక నూలుపోగనినట్లు, మేమీ వర్తకునకు బాకీపడియుండిన రెండువేల వరహాలును మాయం దనుగ్రహించి గైకొనవలెనని వేఁడుకొనుచున్నానని చెప్పెను. ఇచట మేము మీవశమున రుసుమున కాశపడి పని చేసి యుండలేదు. అయినను మేము మీవద్దనుండి యేమో తీసి కొనవలెనను కుతూహలమున నుండిరి కనుక మీచేతి యుంగర మిచ్చెదరేని యంగీకరించెదను. కాని మఱి యేమి యుఁ గైకొననని నారాయణరావుతోఁ జెప్పెను.

తా నెప్పుడు విడనాడఁగూడని యాబటువు నడిగి నందుకు మనమున కళవళపడి "ఇది నావివాహ సమయమున నాభార్యయిచ్చిన బహుమతి. దీని నాజీవితకాలమున నెన్నడు నెడబాయనని ప్రమాణము చేసియుంటిని. ఈయుంగరముకంటె వెలగల మఱియొక యుంగరము నియ్యఁగలుగుదు గాని దీనిమాత్రమియ్యజాల" నని నారాయణరావు చెప్పెను. కళావతి కోపమునొందినటులఁ గనబడి మొగము చిట్లించి ముష్టివానికిఁ జెప్పవలసిన జవాబును చెప్పితివని త్రిప్పుచు లేచి సభనుండి పోవుచుండెను. ఆమాటలకు నారాయణ రావెంతయు లజ్జపడి యాయుంగరమును వెంటనే కళావతికిచ్చివేసెను. అపుడు శేఖరిగ నటించుచున్న సునంద వామనరావును జూచి తానుపొందిన కష్టమునకాతని యుం

గరమును దనకు బహుమానముగ నిమ్మని యడిగెను. ఔదార్యమునఁ దన మిత్రునికంటెఁ దక్కువవాఁడని యనిపించుకొనుట కిష్టములేక యతఁ డడిగినతోడనే యుంగరము నిచ్చివేసెను. ఆసోదరులు దమలోఁ దాము నవ్వుకొని తామిల్లు జేరినవెంట నుంగరములఁ బోఁగొట్టుకొన్నందునకు నాథుల మీఁద నేమి కల్పింతమా యని యోచించి, మఱియొకయువతి కిచ్చివేసితిరని నెపపెట్టుటకు నిశ్చయించిరి.

తరువాత కళావతియు సునందయుఁ దమ గృహమునఁ బ్రవేశించి పురుషవేషములు విసర్జించి స్త్రీవేషములు ధరించుకొని తమ నాథులరాక కెదురు చూచుచుండిరి. ఇంతలో నారాయణరావును, వామనరావును, జయరావును వెంటఁ బెట్టుకొనివచ్చి యిల్లు చొచ్చిరి. నారాయణరావు దన చెలికాని కళావతికిఁ జూపినందున యామె కుశలప్రసంగము చేసి యతిథి సత్కారముల నొనర్చెను.

ఇంతలో నింటిలోపలనుండి సునందయు భర్తయు కలహించుచున్నట్టు వినవచ్చెను. ఇటకుఁ జేరి యరగంటయైనను కాలేదే. అప్పుడే కలహమా? కలహమునకుఁ గతంబేమియని కళావతి యడిగెను. ఈపొట్లాటంతయు వివాహమునాఁడు తీసికొనిన యుంగరమునకని వామనసింగు చెప్పెను.

అంత సునంద నేనా యుంగరమును నీకొసంగినప్పుడు నీయూవజ్జీవము నీవద్ద నుంచెదనని చెప్పి యిప్పు డెవ్వరో యొక న్యాయవాది లేఖరి కిచ్చితినని చెప్పుచుంటివి. నీవు దానిని మఱియొక స్త్రీకి యిచ్చియుందువని చెప్పెను. నా మాట నమ్ముము. నీతోడు. ఆబటువును నేనొక చిన్నవాని కిచ్చియుంటిని. ఆతడు నీవలెనే నీయంతవాడుగున నున్నాడు. ఈనడుమ జయరావుమీాద వచ్చిన వ్యవహారమున నాతని ప్రాణములఁ గాపాడిన న్యాయవాదివద్ద నాతఁడు లేఖరి. తాను పడిన కష్టమునకుఁ బ్రతిఫలముగ నీబటువునిమ్మని యడిగినందున లేదనలేక యాతనికిచ్చివేసితినని వామనరావు చెప్పెను. నీభార్య నీకుఁ బ్రియపూర్వకముగ నిచ్చిన వస్తువు నెవరో యొక లేఖరికిచ్చుట నీతప్పు. నాప్రాణనాథుండగు నారాయణరావునకు నేనొక బటువునిచ్చితిని. ప్రపంచమంతయు తలక్రిందులైన నాతఁడు దానిని మఱియొకరి కిచ్చునా యని కళావతి యేమియు నెఱుఁగనిదానివలెఁ బలికెను. నాయుంగరమును లేఖరికిచ్చినది తప్పే. కాని నారాయణరావు ప్రథమమునఁ దన యుంగరము నిచ్చివేసి యుండగా నాతనికడనుండి కష్టపడి ప్రాతపని చేయుచుండిన లేఖరికి నేనుంగరమును దరువాత నిచ్చి యుంటినని వామనరావు నిజము చెప్పి వేసెను. కళావతి మిక్కిలి కోపము జెందినటులు నటించి యుంగర మన్యులవశము జేసినందుకు నారాయణరావు నతి నిష్ఠురముగ మాటలాడి యుంగరము పోయిన

జాడను వసంత దెలుపుచున్నది గావున తన యుంగరమును మఱియొక స్త్రీవశమున నుండియుండునని తలిచెను. తన ప్రియురాలి కంతకోపము గలిగించినందునకుఁ జింతాక్రాంతుఁడై నారాయణరావు దైవముసాక్షిగా నేనాయంగుళీయకమునే యువిదకు నీయలేదు. రెండువేల వరహాల నీయఁబోయిన నంగీకరింపక యుంగరము వాంఛించిన న్యాయవాదికి నొసంగితి. నేనాయుంగరము నీయనని మొదట వచింప మొగము చిట్లించుకొని లేచిపో నుండెను. నీవాసమయమున నుండినచో నన్నాయుంగరము నిచ్చివేయుమని చెప్పియుందువని తలిచెను.

ఈదంపతుల కలహములకెల్ల నేనే గారణమని జయరావు విచారింపఁజొచ్చెను. కళావతి యితనిఁజూచి మీమీఁద నాకెంతమాత్రము గోపములేదు. ఈవిషయమున మీరెంతయు జింతింపఁవలదని యాతని నూఱడించెను. నారాయణరావు గుఱించి నేనొకసారి నాశరీరము నిచ్చివేసితిని. నీ పెనిమిటివద్దనుండి యుంగరము దీసికొనిన యాతఁడు చేసిన సహాయమున నేను జీవించి మిమ్ములఁజూడగంటిని లేనియెడల నేను కొలదిదినములక్రింద మృతుఁడనై యుండవలసినదే. ఇక ముందెప్పుడును నీభర్త నీకిచ్చినబాసను తప్పకుండ నా శరీరమును పూఁటపెట్టెదనని జయరావు నమ్మించెను. ఆతనికి నీవు పూటబడుదువేని యీబటువు నాతనికిచ్చి మును

కటి దానికంటె దీనిని భద్రముగ నుంచుకొనునట్లు చేయుమని కళావతి బటువునిచ్చెను.

నారాయణరావు ఆయుంగరముఁ దీసికొనిచూచినపుడు అది యింతకుమున్ను దానా న్యాయవాదికిచ్చినదే యైనందున నివ్వెఱఁగొందియుండెను. అపుడు తానే న్యాయవాదియగుట యు సునంద తన లేఖరి యగుటయు కళావతి చెప్పెను. తన భార్యయొక్క బుద్ధికుశలతవలననే జయరావు కాపాడఁబడె నని తెలిసికొని నారాయణరావు విస్మయప్రమోద మగ్నమాన సుఁడయ్యెను.

అపుడు భర్తలు భార్యల నానవాలు పట్టలేకపోయి నందునకును, ఉంగరముగుఱించి వారు పన్నినపన్నుగడకును, ఒకరినొకరు చూచి నవ్వుకొనిరి. వామనసింగు తనజీవితకాల మున సునందయొక్క యంగుళీయకమును గాపాడుటయందుఁ బుచ్చుకొనినఁ తశ్రద్ధను మఱియొకవిషయమునఁ బుచ్చుకొన నని చెప్పి యందఱను నవ్వునట్లు చేసెను.



# శ్రీకృష్ణుని రాయభారము.

అజ్ఞాతవాసానంతరమునఁ బాండవులుపప్లావ్యమునఁ గొంతవఱకు వసించి యాపట్టణమును వదలిపోయిన మఱునాఁడు పాండవాగ్రజుండు దమ్ముల సుతుల నిష్టభృత్యవరులఁ దొరలఁ బిలువఁబనిచి యెల్లరు వినుచుండ "మనమిపుడు కృష్ణునిచెంతకుంజని యాతనిఁ గౌరవసభకుఁబంపి సంధి చేయుమని ప్రార్థించిన నది కుదురుచో బంధు హిత గురుజనములతో రణముగాక మేలగును." అని పలుక వారలందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యాతనిచే సత్కృతుండై సహస్త్రపరిజనంబులుం బరివేష్టింప నొక్కపార్శ్వంబున బాంచాలియు సముచితపరివార పరివృతయై యుండ నతండునుం దారును సుఖాసీనులై యుండి యతనితో

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపిశుభంబైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియెమహాత్మా'

అనిపలికి నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడి వారము. మమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు

మనవుడు వాసుదేవుండు నీవంచినయట్ల చేయంగలవాఁడ నెట్ట్యాది తలంపు నెవ్వమనిన నజాతశత్రుండు "నీవుకరినగరం బున కరిగి కౌరవుల తోడందగిన మాటలాడి తెలుంగునేయు ము. మఱియు మాధవా! ధృతరాష్ట్రిదుర్యోధనుల యభి ప్రాయంబులు నిన్నను సంజయునివలన వినియుంటిని. జూద మున నిర్ణయించుకొనిన కైవడి వనవాస యజ్ఞాతవాసంబులు జరిపి మారాజ్యభాగమును మేమడుగ ధృతరాష్ట్రుఁడు సహి తము కులధర్మంబు నడపవలెనని యొంచక చెడుతలంపుగల దుర్యోధనుని యిష్టప్రకారము నడచుచున్నవాఁడు. ఇచ్చటి బంధువులు నీవు నచ్చెరువడివినుచుండ నయిదు గ్రామములు నిచ్చినను మేము తృప్తులమగుదుమని నిన్నటిదినమున సంజ యునితోఁ జెప్పి పంపినమాటయు వార్థము.

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రమును జేయంజాలఁ డో కాసుపెం

పేదం గూ్రరతకోర్వ రాదు సిరివాకేలందు నే గ్రాసవా సోదైన్యంబులు వచ్చునాయరయు నీచుట్టాలకుంగావునన్ మోదంబందుట గల్గుఁగౌరవులు నేమంబొందిశ్రీనొందినన్.

ఒక వేళ సంగ్రామము సేయవలసి వచ్చినచో దాని యందెవరు గెలిచిన నుభయపక్షములందును పలువురు బంధు మిత్రులు చావక మానరు. తుచ్ఛపురాజ్యమునకై యాశపడి

వారి చావు నపేక్షించుటకంటె వేఱు పాపకార్యము లేదు. ఆయుదూళ్లిచ్చినను జాలునని మేము పంపిన వర్తమానము నకుఁ గౌరవు లంగీకరింపకున్నను, వారిపక్షమునందుండిన భీష్మ ద్రోణాది బాంధవులను పూజ్యులను జంపుటకు నామనసొప్ప దు. కావున నీవు గౌరవ సభకుం జని భీష్మాదులు వినుచుండ మా పెదతండ్రితో మాటాడి యెట్లయినను సంధి చేయు”మని చెప్పెను.

భీముడు—

ఉ. కయ్యముఁ గల్గినట్లయిన గంధగజ ప్రకరంబు కుంభముల్ వ్రయ్యఁ దురంగపఙ్క్తులు ధరంబడఁ దేరిగముల్ బడల్పడన్ డయ్యమికీవు వెక్కసపడక గదపంపుపు సేయఁ గోరునా దయ్యము నెత్తికోలు దుదిఁ దాఁకుటగాదె భుజంగభంజనా.

అర్జు:—

ఉ. పాలదుగుండు కౌరవుల పాలికిబోయి యుతెందు లోభియై పాలదియెందుకోయనిన పాలు తెలంగెటేఁగింపు భీమభూ పాలుని పాలుతాను తన పాలిటి మేదిని యన్నపాలు భూ పాల కుమా రవర్గమును బాలుఁడుమా యభిమన్యుపాలు నా పాలునమస్తసైన్యముని పల్కవె పంకజనాభ యచ్చటన్.

నకు:—

సీ. గోగ్రహణంబున గోలెనఁతియుమెత్తఁ
బడకుండుదురెవారు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మిమైఁగూడిన
బలములే డక్షౌహిణులనుదొరల
పాంచాల యాదవ పాండ్యకైకేయ మా
త్స్యుల తెంపులెఱుఁగక యున్నవారె
భీమార్జునుల లావుపెంపును నీసహా
యంబును గలుగుట కలుక రెట్లు
గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి
సెప్పివారిఁ జక్కఁ జేయరెట్లు
కార్యమీవు సెప్పఁగా విదురుండు వి
నంగనెట్లు గాదనంగవచ్చు.

సహదేవుడు—

మ. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరువంచించి యాం
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రాపాలీక పోవచ్చునె
యుదిగాదేఁ దెగి బంటపై యుఱుము మాయల్ వన్న నేర్పింకఁ జె
ల్లదు సూసీకని యాసుయోధనుని యుల్లంబుచ్చి పోనా
డుదీ.

ద్రౌపది:—

ఉ. ఈవెండ్రుకలుపట్టి యీడ్చిన యాచేయి దొలుతగాఁబోరి లో దుస్ససేను
తనువింతలింతలు తునియలై చెదరి రూకటియున్నఁ గని యుదు కాలుఁగాక
యలుపాలఁబోనువదునట్టి చిచ్చేయిది పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవమునునొక విల్లెప్పు డును వహించు.

ఆ. వె. క్షత్రవిక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములువడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుఁగుఁ గన్నారఁ
గానఁ బడయమైతి మేనిఁ గృష్ణ.

అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుండై నారాయణుం డూరార్చి "లలనా! శాంతింపుము. నీవు కురునృపాల పుత్రకళత్రంబుల యేడ్పులు వినుచు సవ్యకాలం బాసన్నంబయ్యె" నని చెప్పెను.

పిమ్మట ధర్మనందనుఁడు దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి నీనక్షత్రంబు రోహిణిగదా. ఎల్లి రేవతి, నీకుఁ జంద్రతారాబలంబులుగలవు గమనంబునకు రేవకడయ మేలు,

ప్రయనంబునకు లెస్స యని చెప్పిన, మఱునాఁ డరుణోదయం బునఁ గృష్ణుండు కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తిసేసి యగ్నిసమారాధనం బాచరించి సాత్యకియుం దానును హస్తినాపురంబునకుం బయనమై బయలు వెడలి సుఖంబున నచటఁ జేరిరి. అచట ప్రథమమున ధృతరాష్ట్రుని, బిమ్మట వరుసగ విదురుఁడు, కుంతి, దుర్యోధనాదులఁ జూచి తన రాకకుఁ గారణమును దెలిపి సాయంతనము విదురు నింటికిఁ బోయి భోజనము చేసి నిద్రఁ జెందెను.

ఇట్లు సుఖనిద్రసేసి వేగుంబోకట మాగధ మంగళ గానంబుల మేలుగాంచి సమయ కర్తవ్యంబులు సలిపె. అట్టి యెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషో త్తముండు వారలు మొదలుగా యిష్టజనంబులు పరివేష్టింప నుచిత ప్రదేశంబున నున్నంత దుర్యోధనుఁడు కర్ణ శకుని దుశ్శాసనులను వెంటఁ బెట్టుకొని కృష్ణుని యొద్దకువచ్చి 'ధృత రాష్ట్రుఁడు బంధుమిత్రాది సమస్తపరిజన సమన్వితుండై పేరో లగంబున నీనికి యెఱింగించిన శ్రీకృష్ణుండు సంతోషించి రథముపై నెక్కి సభకుఁ బోయెను. ధృతరాష్ట్రుఁడును, భీష్మ బాహ్లీక ద్రోణాది రథికులందఱును కృష్ణున కెదురురాను వారలనందఱ నాదరించెను. ఆసభకు జమదగ్ని కణ్వ నార దాదిమహామునులు దయచేసి యుచితాసనములపైఁ గూర్చుండి దుర్యోధనాదుల చర్యను గమనించుచుండిరి. శ్రీకృష్ణుఁడు

వచ్చిన మునుల కందఱకును నమస్కారముగావించి యర్ఘ్యా సనత్కారంబుల నందఱను తృప్తిపరిచి తాను పిమ్మట కూర్చుండెను. తరువాత లేచి యందఱకు వినఁబడునట్లు ధృతరాష్ట్రునితో "పాండుకుమారులు నీకుఁ బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పుమని నాకుఁ జెప్పిన విధంబు వినుము. తన పంపునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి. పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబును జరిపితిమి. మా తండ్రి సమయంబు పరిపాలించి రేమస్వరాజ్యం బెల్లనుం బడయుదుమని కృతనిశ్చయులమై పడితిమి. తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరముగలిగినం గినిసి యిట్లుగా దల్లని చక్కంబెట్టునది. లేనగల పదివేలేండ్లకుం దన్నగాని మఱిమొఱుంగ మెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులు తలంపరు తనయందుఁ దెలుంగుగలిగిన నెవ్వరు గొంటగాకున్నను గుణంబు పాడి నెరక చెల్లు"నని చెప్పి పిమ్మటఁ దనమాటలుగ "ఈభరతవంశమునకు నీవే యాధారభూతుండవు. కురుపాండవులలో నెవరెవరి నడవడిక యెట్లుండినను దానివలన గలిగెడు కీడుమేళ్ళు నీవుఁ జెందుదువు. కౌరవులన్యాయపరులును కార్యాలోచనము లేనివారునై తాము చేయుచున్న కార్యము సరియైనది కాకున్నను సమంజసమని తలఁచుచుందురు. చెడ్డ కార్యాలందుఁ బ్రవేశించుటకు ముందంజ వేయుదురు. వీరు స్నేహభావము వహించి సంధిగావించుకొనినఁ గురుపాండవు

లకును వారిని చేరియుండిన రాజులకును మేలుగలుగును. కనుక నీవీ విషయమై చక్కగ యోచించి సంధిఁగావింపుము. పాండురాజుయొక్క రాజ్యభాగమును పాండవులకొసంగి నీ రాజ్యభాగము నీవు పుత్రపౌత్రసహితంబుగ ననుభవించి సుఖముననుండుము. కురుపాండవులకు మేలుసేయఁగోరి నే నింతవరకుఁజెప్పితి. అతిలోభగుణంబుగల దుర్యోధనుని దుర్బుద్ధులుమాన్పి పాండవులను చెంతజేర్చుకొనుము. అట్లు నీకిష్టము లేనియెడల శాంతశూరులును నీపాదసేవజేయుటకు యత్నంబు సేయువారగు పాండవు లిప్పుడ యుద్ధమునకుఁ బూనెదరు" అని చెప్పెను.

సభయందుండిన జమదగ్ని మొదలగు మహర్షులందఱీమాటలు విని యానందంబునొంది "శ్రీకృష్ణుఁ డందఱకు సంతోషకరంబగు మాటలఁ జెప్పెను. కౌరవులు నీతివంతులై పాండవులతో సంధిచేసికొనుటకంటె నుత్తమమగు కార్యము లేదనిపలికిరి. అంత

దుర్యో—మూరెడేసి గడ్డములఁ బెంచి కందమూలములఁ దినెడి ఋషులును, ఎల్లప్పుడు గొల్లభామలఁగూడి వెన్నముద్దలు మ్రింగుచు పొద్దుపుచ్చెడి కృష్ణుఁడునా? నాకుఁ జెప్పునది. నీనిమాటలు నాకు నచ్చవు నాకుఁదోచినది నేఁ జేసెద.

కృష్ణ:—విమలంబగు వంశమున జనించి సుగుణంబులం దనరువాఁడవై యిట్లాగ్రహము సేయఁ దగునా! నామాటలు వినువాఁడవైన దురభిమానంబు విడిచి పాండునందనులకు సమభాగంబుగఁ బంచియిచ్చి మీరు నూర్గురును, వారైదుగురును గలసి సుఖంబున నుండుడు మీరు నూటయేవురు నేకీభవించి యుండుట కార్యంబు. పండ్రెండేండ్లరణ్యావాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబును జేసివచ్చిన ధర్మరాజాదు లేవురు నింద్రప్రస్థంబును, అవంతియు, యను ప్రస్థమును, వారణావతంబును, హస్తినాపురంబునను నైదూళ్ళ నడుగుచుండిరి. వాటిని నవశ్యము నీయఁదగినది.

భీష్ముఁ:—నాయనా! దుర్యోధనా! నీజనకుని యాలోచన విని పాండవులతో సంధి చేసికొనుము. బుధవత్సలుఁడగు శ్రీహరి యిటకేగుదెంచినకతన మన వంశమెల్లను పావనంబయ్యె. కృష్ణార్జునులతోడి విరోధంబీ బంధులోకంబునకు కాదు. లోకంబున నెవ్వరికిం జూడంబోలదు. సంధి గురించి యాతఁడు పలికిన పలుకులు విని యెట్లైన ధర్మరాజాదులతో నొడఁబడుము.

ద్రోణా:—సుయోధనా! మీవంశమునకు గురుఁడనై మీయశస్సుఁ గోరు నామాటలు విని దుర్జనాలోచనల విసర్జించి మీబంధువులతో సంధిచేసికొనుము. అట్లయిన నాయు

లతో వర్ధిల్లెదవు. నీవు సుఖముగ నుండిన మాకన్నులార జూచి సంతోషించెదము.

భీష్మ-ద్రోణులు:—శ్రీకృష్ణుని సారథ్యమునఁ బాండవ మధ్యమునందు గాండీవంబుచేఁ బూని రాకమున్నె పాండవులతో మైత్రినొంది కురువంశమును గాపాడుము. మఱియుఁ గురుపాండవులు సఖ్యముఁబొంది కూడి సుఖంబుననున్న సకలభూప్రజకుఁ బ్రమోదంబగుఁ గావున నట్లుసేసి యందఱచే దీవనలు వడయుము.

దుర్యో—శ్రీకృష్ణా! పాండవపక్షపాతీ! మేమును బాండవులును బంచికొని పరిపాలించుట యెన్నటికిని జరుగదు. కయ్యంబు సేయక వాఁడియగు సూది మొన మోపినంత మాత్రపు భూమియైనను బాండవులకు నేను బంచి యీయ నొల్లను.

కృష్ణు—కపిధ్వజమును గాండీవమును మెరయఁ బాండవ మధ్యమునందగు నర్జునుండును, గదాదండంబు బిరబిరం ద్రిప్పుచు మత్తేభంబునుం బోలె వృకోదరుండును, రణమునకు వచ్చి నిలిచినప్పుడు సకల రాజ్యమును నీవే పంచి యిచ్చెదవు.

దుర్యో—మధుసూదనా! కుందనము చందంబున నచ్చైన దేహకాంతులు వెలుంగ మదపు టేనుఁగు విడివడిన కరణిఁ దేజరిల్లుచు మహామేఘంబునుం బోలె గర్జిల్లును నాసరించిన సైన్యంబుల నుక్కడగించుచు రథము బహువిచిత్రగతుల నడిపి పరఁ జేయుచు నాదిత్యనందనుండగు కర్ణుండు సమరమును దేజరిల్లునెడ నీవే చూడఁగలవు.

కృష్ణ—ఈబలమును నమ్మితివేని నీ యేనుఁగులు గుఱ్ఱములు రథములు లేక యొంటరివై యొక్కపాదచారమునఁ బలాయనము సేయఁగల వాఁడవు సుమా.

దుశ్శా—అన్నా దుర్యోధనా! పాండవులతో సంధికి నొడఁబడుచో గురుభీష్మాదులు చేసిన బోధనము మనకనుకూలము కాదు. నీవిటనుండినఁ గీడు మూఁడుట నిక్కువము. కావున నామాటలు విశ్వసించి యీసదనము విడిచి పొమ్ము.

అంత దుర్యోధనుఁడు బాహ్లికాదులగు వృద్ధులను ధృతరాష్ట్రుని శ్రీకృష్ణుని సరకు సేయక కొలువుకుం డి దగ్గన లేచి పోయెను.

ధృతరాష్ట్రుఁడిది విని యదరిపడి, గాంధారి తన కుమారుని శాంతింపఁ జేయగలుగునని, యామెనుతోడ్తేర, నాపెయు

నేతెంచి కొమరుని గొనితెమ్మని విదురునిఁ బంపెను. సుయోధనుఁడు దనతో మఱలిన దుశ్శాసన శకుని కర్ణాదులు వెంటరానేగుదెంచి నిజాసనంబునాసీనుఁడయ్యె. తల్లి మనమున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును జుట్టరికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబు కొలందియు గులజన చిత్త ప్రకారంబును బాంధుసందనుల బలపరాక్రమంబులుఁ దెలియునట్లుగ దెలుఁగుపడం జెప్పి బుజ్జగించెను. దుర్యోధనుండు గినిసి యమ్మాటలమీఁద ననాదరంబుసేసి యుద్ధతిం గ్రమ్మఱ కర్ణాదులం గలిసి చని, "భీష్మద్రోణుల వశపరచుకొని మనల నీకృష్ణుఁడు కఠినముగఁ బలుకుచున్నాఁడు. ఈతని నిచటఁ జెఱఁబెట్టి పాండవులకు దిగులు పుట్టింతము. అప్పుడు వారు కోఱలుదీసిన పాములవలె నుండి వారు మనకు లోఁబడియెదరు." అని దురాలోచనంబుసేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులగు దుష్టచతుష్టయంబు మొదలుగాఁగల యవినీతులు మాధవుంబట్ట నిశ్చయించిరి.

వీరి యత్నములు సాత్యకి గ్రహించి సత్వరంబున హరి కడకుం జని యత్తెఱంగెల్ల నెఱింగించి తదనుమతిని గౌరవేశ్వర బాహ్లీక భీష్మ విదురులకుఁ దెలియపరచెను. ధృతరాష్ట్రుఁడు విని దుర్యోధనుని దోడ్తెమ్మని విదురుం బనుప నాతండు సపరివారంబుగ దుర్యోధనుని తీసికొని వచ్చెను అంత దుర్యోధనునితో

చ. అలవిమెఱుంగకిట్లు దనుజాంతకిఁ గీడొనరింప నీవు నీ
తులువలునుత్సహించితిరి దుర్మతులారనవారు మీకుఁ జో
కలవడి పట్టవచ్చున మహాద్రిగదల్పఁగఁ బోలునే దవా
నలుఁ జమరంగ శక్యమె వినాశముఁ బొందెదరేమి సే
యుదుర్.

ఆ. అనిన విదురుఁ డిట్టులను సుయోధనుతోడ
బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ
డచట నచట నెవ్వరెవ్వరి నేమని
సేసె వినవె యేల చెడియెదిట్లు.

శ్రీకృష్ణుండు కట్టెదురనున్న సుయోధనుం జక్క౦
జూచి యేనొక్కరుండయని తలఁచియె దుర్మదంబునం బాదివి
పట్ట నుత్సాహంబు సేసితివి. అని చెలునవ్వునవ్వ సభ్యులెల్ల
రు నాశ్చర్యమంద లోకభయంకరమగు విశ్వరూపము చూపె
ను. దానింజూచి సభవారందఱు లేచి భయమున వణఁకు
చుండ నారదాదులు స్తుతించుచుండిరి.

అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు కృష్ణుని ది
వ్య విజృంభణంబు గావలయునని యెంచి మహానుభావా! నీచ
రణంబులు గనుగొన దృష్టి ప్రసాదింపుము.

చ. అనుడు దయార్ద్రచిత్తుఁడగు నప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టియు
జ్జనపతి కద్భుతం బెసర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడున్
గనుఁగొని భక్తి మ్రొక్కి వినుఁ గాంటిఁ గృతార్థుఁడనైతి నింక నో
ల్లనొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే.

యనిన దామోదరుఁడు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతని కన్నులెప్పటి యట్లు గావించి నిజ విశ్వరూపంబు నుపసంహరించి లేచి సభవారి యొద్ద సెలవు గైకొని కుంతీగృహంబున కేగి యామెకు నమస్కరించి కొంతసేపు మాటలాడి వెడలి సేనతో వచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువం బంచె. తాను రథారోహణంబు సేసి కర్ణు దెసం గనుగొని నన్ననివి వచ్చెదవుగాని రమ్మని కరంబు సాఁచి చేయిపట్టి తనరథంబెక్కించుకొని కొంతదూరము కొనిపోయి కర్ణా! నీవు కుంతికి సూర్యుని వరమున జన్మించి రాధచేఁ బెంపఁబడి యుంటివి. ఈసంగతి నీకుఁ దెలియకఁ గౌరవులఁ గొలుచుచుంటివి. ఇపుడైన నీవు నామాటలు విని పాండవుల కడకు వచ్చిన నీచే మహీచక్రమంతయు నేలించెద నని చెప్పెను. రాధేయుఁడు శ్రీకృష్ణుం జూచి మాధవా! నీవు నాయెడఁ జూపిన దయకు సంతసించితిని. ఈ భూమండలంబున నీకుఁ దెలియని ధర్మములు లేవు చంచల రాజ్యలక్ష్మికాసం జెంది నే నార్జించి

యుండిన యశముం గోలుపోవువాఁడనుం గాను. వానిభవంబు నకా దుర్యోధనుఁ డకారణంబు నే నాతని వలన జీవించుచు నిప్పు డాతని విడనాడిన జనులు నన్ను నీచదృష్టిం జూచెదరు. నీయాజ్ఞ మీరినందుకు క్షమింపుము. ధర్మ మెచట నుండునో యచట జయముగలుగుట నిశ్చయ” మని పలికెను. కృష్ణుఁడు బదులు చెప్పలేక కర్ణు నచట వీడుకొలిపి పాండవుల యొద్దకు వచ్చి కౌరవసభను జరిగినదంతయు పూసగ్రుచ్చి నట్లుగ విన్నవించి “సంధియు కావలయునని పౌరలంగల యంతయుం బోరవితి. దుర్యోధనుఁ డెట్లును జక్కఁబడక తన చలంబుతో నీపట్టుపౌరలయ్యుఁ గయ్యంబు వేడుచుం గాని యనశ్యంబుగ రాజ్యంబు పాలిచ్చువాఁడు గాఁడు. కౌరవుల యెడ దండంబు దక్క నొండుపాయంబు లేదు. మీకుం బోలిన తెఱంగు సేయుం” డని పలికి యుద్ధాస్థానంబునకుం జనియె.



# లంకాదహనము.

శ్రీయుతమై తనరారు నయోధ్యకు పతియై యొప్పు దశరథుని జ్యేష్ఠకుమారుఁడగు శ్రీరామచంద్రుండు పితృవాక్యపాలనమున వనవాసంబునకుం జని సీతా లక్ష్మణ సహితంగ గౌతమీతీరమునఁ బంచవటిం బర్ణశాల నిర్మించి యందు నివసించియుండెను. లంకాధిపుండగు రావణుఁడను రాక్షసుఁ డచటికి రామలక్ష్మణులు లేని సమయమునఁ జని సీతం బాదిని బట్టి తన యరదముపై నిడి లంకకు గొనిపోయెను.

రాముఁడు దిరిగి వచ్చి చూచి సీత లేమికిఁ గను దుఃఖితుఁడై యామెను వెదకుచు పోయి మార్గమున కిష్కింధాపురముఁ జేరి వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవునితో సఖ్యము జేయ, వాతఁడు సీతాన్వేషణమునకై పలువురు వానరుల ననిచె. వారు సీతను వెదకం బోయి పోయి తుదకు సంపాతి యను పక్షిరాజముచే నామె వృత్తాంతముఁ దెలిసికొని సముద్రము జేరి యచటనుండి వానరులలో మహావీరుఁడగు హనుమంతుని లంకకుఁ బంప నిశ్చయించిరి. అతం డంగీకరించి బయలువెడలి మార్గమునఁ బలుకష్టములఁ బడుచు సముద్రంబు నవలీలగ దాఁటి సూర్యుఁ డస్తమింపక మున్న ప్రదోషకాలమున లంకాపురముఁ బ్రవేశించెను.

అప్పు డప్పుర వరద్వారంబున గావలియున్న లంకిణియను నొక్కరక్కసి పవనజుఁ జూచి యట్టహాసంబు సేయుచుఁ ద్రోవ కడ్డంబు నిల్చిన దానిఁ జూచి "నీ విట్లడిచి పడ నేటికి? నే నీ లంకాపట్టణముచుఁ గాంచి మరల నీత్రోవను జనుదెంచెద నన్నడ్డగింపక పోనిమ్ము"ని చెప్పెను. పవనసుతుండు చెప్పిన మాటలు వినక యది క్రోధవికృతాననయై ఘనవాదంబున నార్చుచు నాతని ఱొమ్మును బొడిచెను. వాయుసుతుండది పడఁతి కదా యని చంపనొల్లక పిడుగడఁచురీతి దానిఁ బిడికిట బొడిచెను. ఇట్లు వ్రేటువడి వజ్రప్రహారంబున ఱెక్కలుదెగి కూలుపర్వతంబుపగిది గాఢమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం ద్రెళ్ళి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞయై వికలంబులైన యంగంబులు సవరించుకొని గద్గదకంఠయై "కపివర్యా! నన్నుఁ జంపకుము. నేను నీచే నిర్జితనైతి. ఎపుడు కీశుఁడేతెంచి నన్ను నిర్జించు నప్పు డప్పురికిఁ జేటగు నంచు నాకు మును పద్మాసనుండు వరమిచ్చె. ఆ కపి పలుకు సత్యంబుగాదు. మహీసుత కారణమున రక్కసులందఱు కూలఁగలరు. పంక్తికంఠుండు చావఁగలఁడు. ఇపుడు నీ వీపురిఁ జొచ్చి సుఖంబుగ నెల్లెడల జనకజను వెదకి పనులన్నియుఁ దీర్చికొను"మని పలికిన నా రాత్రికాలమున లంకాపట్టణమంతయు శోధించి యద్దేవి నెందుం గానక తనలో 'రామబాణములకు భయపడి రావణుఁడు వనమధ్యంబున నామెం బాఱవైచెనో, ఆకాశమార్గమునఁ బోవు నపుడు వార్ధిం జూడ నామె గుండెలు పగిలి యసువులఁ బాసి

యుండెనో, లంకకుఁగొనిపోవునపుడు రావణునివశమునసుం డనోపక సముద్రమునఁగూలెనో, తనమాటలు లక్ష్యముచేయమి వంకఁ దామ ఖుఁ డావెను మ్రింగియుండెనో, యనిశము దైత్య మధ్యగతయై హారామ! హాలక్ష్మణ! యని వాపోవుచుఁ బ్రాణములువిడిచెనో తెలియదు.

నేను రాముని సమీపించి యవని పుత్రిక మృతయ య్యెనని గాని, యసురనాథుఁడు దాఁచి యుండెనని గాని, యూమెజాడఁ దెలిసికొన లేకపోతినని గాని, యెటులఁ జెప్పు దు? సీతను గానలేక పోతినని చెప్పిన వెంట నతిదుఃఖమున రాముఁడు గతించు. రాముని గతిచూచి దుఃఖించి యాతని ప్రాణతుల్యుఁడగు సౌమిత్రి జీవితముఁ ద్యజించు. రామలక్ష్మ ణుల చందంబెఱింగి తత్క్షణంబ భరత శత్రుఘ్నులు పంచ త్వంబు నొందెదరు. అంతఁ బుత్రవ్యసన కర్శితలై ప్రియ పుత్రిలగు కౌసల్యయుఁ గైకేయియు సుమిత్రయు జీవితంబులు విడిచెదరు. రామునివిధంబుఁ జూచి ధర్మజ్ఞుండును సత్యసంధుఁ డును కృతజ్ఞుండు నగు సుగ్రీవుండు గడతేఱు. ఆతనిపాటుఁ జూచి రుమ భర్తృశోకంబున నిరానందయై మరణంబునొం దు. వాలి దుఃఖంబునను పీడితయై శోకకర్శితయైన తార సుగ్రీవుండు పంచత్వమునొందినం దప్పక నశించు. పితృ మాతృ వినాశవ్యసనంబునఁ గుమారుం డంగదుఁడు మృతుం డగు. అంత భర్తృవ్యసన కర్శితలై వానర కాంతలెల్లఁ

గాఢముష్టి ప్రహారంబుల శిరంబులు పగులమోఁదుకొని మడిసెదరు. తదనంతరంబ సుగ్రీవుని చేత సంరక్షితులగు వానరులందఱుఁ గడసెదరు. ఈవృత్తాంతంబు విని వన శైల నివాసులగు కపులందఱు పుత్రదార మాతృసహితంబుగా శైల శృంగంబులనుండి పిఱుకంబడియైన విషంబుఁ గ్రోలియైనఁ బావకునందుఱికియైన నురిగొనియైన నుపవాసంబు సల్పియైన శస్త్రపతనంబు గావించియైనఁ బ్రాణంబులు విడువం గలరు. ఏనిపుడు పోవకుండిన నెన్నటికైన జానకిని కనివత్తునని రాముఁడు ప్రాణములు నిలిపికొని యుండును గాన నేనిపుడు రాముని కడకుఁ బోవందగదు. మునివృత్తి నడవికిం జనెద లేక శుష్కకాష్ఠంబులఁ జితి యొనర్చి మండెడు చిచ్చున నుఱికెద. మఱియు జానకిఁ గానక రామునికడ కేగిన నతండిపుడ మేను విడువఁ గలడు. అట్లు సేయక యిచట చచ్చిన నామానిని వార్తఁ గానక క్రమంబునఁ జచ్చు. కావున నీరెంటియందును దోషములు గలవు. కనుక నేనిపుడు మేనుబాయక మునినై జీవంబు నిలిపికొనెదను. వినాశంబునందు బహువిధ దోషంబులు సంభవించు. బ్రతికియుండిన శుభములు వడయవచ్చు. కావునఁ బ్రాణంబులు ధరించి యుండెద. జీవిత సంగమంబున మంగళంబు ధ్రువంబని బహుప్రకారంబులఁ జింతించి తుదకు నేనిపుడు వేగిరపడనేల? జనకనందనఁ గనుఁగొనునందాక నీలంకను నిశ్శంకముగనుండి

గ్రిమ్మలు వెదకెద. మత్కృతకార్యంబున సర్వవానరులు నశింపకుందురుగాక.

అనినిశ్చయించి తుదకు నొక్కకదళీవనంబు ప్రవేశించి యచట నొక శింశుపావృక్షంబెక్కి దానికనతిదూరంబున వ్యాఘ్రీమధ్యంబునఁజిక్కిన లేటివలె బిడాలకంబులనడుమఁగలంతఁబడి పొక్కుచు కీరముభంగిఁ గన్పట్టి రామా! రామా! యని తలంచుచు ప్రాణవిభునిబాసి జీవింపనేల? మరణించెదనని దుఃఖించుచున్న యొకవనితంగనుఁగొనెను. మనమున నానందంబు పొంగఁ దనకు రాముఁ డెఱిఁగించిన చిహ్నములన్నియు పరికించి యామె సీతయగుటనిజంబని నిశ్చయించి పర్ణాంతరమునదాఁగికొనియుండెను.

రావణుఁడు నిజదారపరివృతుండై సీతయుండిన ప్రదేశంబునకుఁజనుదేర నద్దేవి వానిరాకయెఱింగి తనకుఁ బరిత్రాణంబెద్దియులేమికి వగచుచు భయాక్రాంతయై వడవడవడంకుచు నఁలతనంతవిలోకించుచు రామునిఁజేర్కొని రోదనంబు సేయుచు శోకంబునకుఁ దుదఁగానక నివ్వెఱపాటునొందుచు బతిశోకాతురయై శుష్కించుచు నశ్రువానక్లిశాంగియై మూలను శోకధ్యానభయంబుల నడలుచుఁ జింతావిశేషంబుల నిట్టూర్పులుఁ బుచ్చుచు నిరానందయై చింతించుచు రాముని సమాగమంబుఁగోరుచు రావణుని పరాభవంబుఁ గాంక్షించు

చు నేకవేణీధరంబై యసంవృతమేదినిపైఁ గూర్చుండి తనవైపు నకేతెంచు దుర్మార్గుని మోముం జూడక రోసి యధోముఖయై యుండె. రావణుఁ డామెను సమీపించి "సీతా సిగ్గేటికి. ఒకసారి తలయెత్తి యిటుచూడుము. రాముఁ డిదివరకే లక్ష్మణసహితముగ మృతినొందియుండును. అట్లుగాకుండినను ఆతఁ డీవననిధిదాటివచ్చు టెక్కడ? నిన్నుఁ గొనిపోవు టెక్కడ? నీవాతనిపై మనసువిడచి యిచట సుఖంబుననుండు"మని పల్కెను. "నేను జనకునిపుత్రినై రాముని జేపట్టితి. ఒడలు దెలియక నీ విటులు పలికిన నీనాలుక యూడిపోవదా? అరణ్యమున నా విభుఁ డొద్దలేని యెడఁ దస్కరుఁడవై వచ్చి నన్నిటకు మ్రుచ్చిలి దెచ్చితివి. ఆపు డాయన యుండిన నీపదిశిరములను ముక్కముక్కలుగఁ గొట్టియుండు"నని చెప్పెను. ఈపరుషోక్తులు వాఁడి బాణములు చొనిపినమాడ్కిఁ దనకర్ణములు సోకినంత మండిపడి కనుల నిప్పులు రాలఁ గ్రుద్ధుఁడై యామెఁ ద్రుంచెదనని గమకించెను. దివిజారిపత్నియగు మండోదరి యడ్డుపడి "నాథా! ఈమెం ద్రుంచుట నీ కెంతయుఁ దగనికార్యము, ఈమె త్రిలోకపూజ్యుండగు రఘువుని చేపట్టె మఱియు నీవు

ఉ. మానవనాథు రాఘవుని మానవమాత్రునిఁగాఁ దలం
చలో
మానితతావకీన శరమర్దితులై సురలెల్ల వేఁడఁగా

మానవరూపధారియయి మర్త్యజగంబున దుష్టదైత్యులం
బూని వధింప నాజికటు పుట్టిన మాధవుఁగా నెఱుం
గుమా.

సీ. మత్స్యరూపమున సోమకుఁ జంపి ధాతకు
శ్రుతుఁ నొసంగిన దితఁడుగాఁడె
కమఠమై మందరాగము నెత్తి వేల్పుల
కింపుతో సుధనిచ్చి నతఁడుగాఁడె
కిటియై హిరణ్యాక్షుఁ గెడపి బల్గొమ్మునఁ
బృథివీతలం బెత్తె నితఁడుగాఁడె
కరరుహాంబులఁ జీఱి సురలెల్లఁ గొనియాడ
హేమకశిపుఁ జంపె నితఁడుగాఁడె
వామనాకృతి బలిగిట్టినైచి జగము
లేపుతో నాక్రమించిన దితఁడుగాఁడె
భృగుకులంబునఁ బుట్టి ముయ్యేడుమాఱు
వెలక్ష రాజులవధియించె నితఁడుగాఁడె?

కావున నాతని సామాన్యపురుషునిగ నెంచఁదగదు.

అని మండోదరి వినయంబున బోధించి ఈటితెండికందిగిచిన నతండు వల్లెసమెతఁబుగ నిజభవనంబునకుం జనియె. అంత

నకగిరివనియక్తురై కావలియున్న నక్తంచర స్త్రీలందఱు బహువిధంబుల భర్జించుచు రావణుం డైకొనకేని నిన్నుం బట్టిమ్రింగెదమని భయంబుగఱపిరి. వారిమాటలు తృణప్రాయంబులుగ ధిక్కరించిన నయ్యంగనలు తమవలుకులద్దేవియందు నిరర్థకంబులగుట యెఱింగి చేయునదిలేక రావణుని కొద్దకుంజనిసర్వంబును జెప్పివచ్చి మరల యెప్పటియట్లు సీతం గాచికొని చుట్టుంబడి నిద్రించిరి. అప్పు డద్దేవి పరమదుఃఖాక్రాంతయై యార్తనాదంబున విలపించుచుండె.

ఆసమయమున విభీషణపుత్రియగు త్రిజటయను నొక్కరక్కసి యచ్చేరువనిద్రించి మేల్కని సంభ్రమమున నో హో! వేగిరపడకుఁడు రాక్షసవినాశకరంబును రామునకు విజయంబునునగు నొక్కకలఁగంటిని. పడఁతులకు వగపుగల యపుడు పరులకిట్టి స్వప్నముగలిగిన నప్పడఁతు లాపదలచే విడివడి సౌఖ్యమునొంది వెలయుదురు." అనిచెప్పిన నా రాక్షసాంగనలు బెగడొంది యాకలయెట్టిదో దెలుపుమని కోరిరి. రాముఁడు శుక్లమాల్యాంబరములుధరించి చతుర్దంతదంతినెక్కి తమ్మునిగూడి సీతనువెదకుచు జనుదెంచి యామెం గనుఁగొని తొడమీదకూర్చుండబెట్టుకొని కరముచే స్పృశించినట్లును లంకయ దలి దనుజుల వధియించి పదపడి యనుజుని జానకినిగూడి పుష్పకంబెక్కి యుత్తరాభిముఖుఁడై యేగి

నట్లును కలలో నంగనుపట్టె. కావున నమ్మహాత్మునకు గెలుపు వశ్యము సంభవించుననియె.

త్రిజట పలుకులు విని వెఱగుపడి యుద్యానవాంగనలు తత్ప్రకారంబున జానకి నాశ్వాసించుచుఁ బ్రియవాదినులై కొలిచియుండిరి. అంత నద్దేవి

చ. హరిణము వెంటఁబైడి మెకమంచు రఘూత్తము నేల యంచితిగా
బరుసములాడి వెంటన కృపాళుని లక్ష్మణు నేలపుచ్చితిగా
గురుతర దుఃఖవేగమున ఘోరవనంబున నన్నుఁ గాన కా
ర్తె ఱఁగునఁ గుందిరో యెటులు దిమ్మరిరో యెటులార్తిఁ
దూలిరో.

అని విచారించుచు రాముఁడు వచ్చి రావణుం బరిమార్చి సీతం జేకొనిపోవుట నిక్కువంబనిన త్రిజట పలుకులకు సంతసించుచు నవ్వాక్యంబు సత్యంబగు గాక యని దేవతలఁ బ్రార్థించుచుండె. అంజనానందనుం డిదియంతయు విలోకించి తనలో "ఏనిప్పుడు జానకి నాశ్వాసింపక రయంబున నేగి సీతయున్న చందంబెఱింగించి యుద్ధంబుకొఱకు సైన్యసమేతంబుగ రామునిం దోడితెచ్చెదనంటినేని వచ్చునంతదాక నిద్దేవి ప్రాణంబులు ధరియింపనోపదు. అట్లగుటం జేసి

సుగ్రీవుని ప్రయత్నంబులయు వ్యర్థమగును. ముప్పిలిసీతం దెచ్చిన దుష్టాసురుని దోసమని తలంకక త్రుంచి యామెను గొనిపోదునంటినేని కీశసేనలం గూర్చికొని పెనుపోరొనర్చు నున్న మనుజాధిపునియత్నము వ్యర్థమగును. కావున నేనతి సూక్ష్మరూపంబున నీవృక్షముమీద నె యుండి మనుష్యసంబంధి భాషచేత నిద్దేవి నాశ్వాసించెద. ఇదిగాక మఱియొకండు విధంబు యుక్తంబుగాదు. ఇట్లు గావింపక బ్రాహ్మణునియట్లు సంస్కృతవాణి నుచ్చరించితినేని వానరునకీ భాష దెలియదు రావణుండని శంకించి యద్దేవి మిక్కిలి భయభ్రాంతయగు'' నని విచారించి పదంపడి తనరాకను భర్తృకుశలంబు నెఱింగించుటకుఁ దగిన తెఱంగున, "అయోధ్యను దశరథమహారాజు పాలించుచుండెను. ఆయన పుత్రులలో రాముఁ డగ్రజుఁడు. సత్యసంధుఁడైన యాతఁడు జనకవాక్యపాలనంబునకు నఖిల వైభవములు మాని సీతాలక్ష్మణ సమేతుఁడై యడవి కేగెను. ఆయనచే యుద్ధమున నడపియుందనేక దానవులు మడిసిరి.

ఇది విని దానవేంద్రుండగు రావణుఁడు రోషపరీత స్వాంతుఁడై యడవికి వచ్చి రామలక్ష్మణులు దగ్గరలేని సమయమున సీత నపహరించెను. అంత రాముఁ డద్దేవిని వెదకుచుఁ బఱతెంచి వనమున హరివరేణ్యుఁడగు సుగ్రీవునితో సఖ్యమొనరించి వాలినిజంపి సుగ్రీవుని పట్టాభిషిక్తుం జేసెను.

లుపురుకపులు సుగ్రీవాజ్ఞను సీతను వెదకుచు బయలు దేరిరి. అట్లు బయలు దేరిన వారిలో నేనొకఁడను. సంపాతి చెప్పిన విధమున నూఱుయోజనము లంబుధి దాఁటి యీ పురము ప్రవేశించి యెంతయు శోధించి దశకంఠు నిలయ మరసి యియ్యశోకము క్రింద రాముఁడు దెలియఁ జెప్పిన రూపలక్షణములు గల పతివ్రతాతిలకమును గంటి"నని పలికి యూరకుండెను. అంత సీత "యెవరో పుణ్యాత్ముఁడు కంటికిఁ గానరాకుండ నాపతి వృత్తాంతము శ్రవణసుఖముగఁ బలికి యుండె. ఇది యెవ్వరై యుండు" నని తలఁచి వదన సరోజమును బైకెత్తి చూడ వనరుహవిటపాంతరమునఁ గపి వంశాగ్రేసరుఁడగు హనుమంతుడు గన్పించెను.

ఇట్లుచూడ భయము నాశ్చర్యము గలిగి ధైర్యము బూని. "యోకపిపుంగవా! నీవెవరవు. ఇచటికి నిన్నెవరు పంపిరి. కపికులుఁడవగు నీకును నృపుఁడగు రామునకు నెట్లు నెయ్యము గలిగె" నని యడిగెను. హనుమంతుఁడు గేల్మో గిచి నమ్రుఁడై, "అమ్మా! సుగ్రీవుండను వానరుండు భ్రాతృ నిరస్తుఁడై ఋశ్యమూక శైలంబున నుండెను. రామలక్ష్మణు లిరువురు ధనుర్ధరులై నిన్ను వెదకుచు నెచటం గానక యచ టికి వచ్చియుండిరి.

అంతసుగ్రీవుఁడు దనకడకు వచ్చుచుండిన వారిఁజూచి వాలిపంపునఁ దన్ను హింసింపవచ్చుచున్నట్లు శంకించి భయంబున వేఱొక్క శిఖరంబుమీఁదికి రయంబునదాఁటి వారి వృత్తాంతమెఱింగి రమ్మని నన్నుం బనిచె. ఏనప్పుడు భిక్షురూపంబునం జని మహాపురుషులని నిశ్చయించి నారాక యెఱింగించి తదాగమనప్రయోజనం బెఱింగినవాఁడనై వారి నిద్దఱి వీఁపునఁ బెట్టుకొని సుగ్రీవునికడకుం దోడ్కొనియరిగితి. అచట సర్వేశ్వరవానరేశ్వరు లన్యోన్యమైత్త్రిం బ్రకటించి యిరువురకుం బాటిల్లిన యాపదల తెఱంగుఁ దలపోసి యొండొరులకు సాహాయ్యం బాచరించువారై వాలిం జంపి వానరరాజ్యంబు నీకొసంగెదనని రాముఁడు సుగ్రీవునితో శపథంబు జేసె. వానరుల నల్లదిక్కులకుం బనిచి సీతయున్నచో టెఱింగి వైరివధార్థంబరుగునపుడు బలసమేతుఁడనై జనుదెంచువాఁడనని సుగ్రీవుం డొడంబడియె.

రాముఁ డిట్లు వానరరాజుతో సఖ్యం బొనరించి తన బాస నెఱపఁ దలఁచి సుగ్రీవసౌమిత్త్రులఁ గూడి కిష్కింధకుఁ జేరి వాలిం జంపి సుగ్రీవునకు బట్టముగట్టె. అంత సుగ్రీవుఁడు రామభద్రునకుఁ బ్రీతిజనింప ననేకకపుల సమస్తదిగంతంబుల నన్వెదకఁ బుచ్చె. నేనును జాంబవంతుఁడును నల నీల సుషేణాదులును వాలి పుత్త్రు నంగదుఁ బురస్కరించుకొని దక్షిణదిక్కునకుం జనుదెంచితిమి. ఇటు వచ్చి నిస్సందునుం గానక

శోకించుచునుండ, మాకు నను యు కాలం బతిక్రమించె. అంత మేము సుగ్రీవ కల్పితమాసమాత్రకాలాతి క్రమణంబునఁ బ్రాణంబులు పరిత్యజింప సమకట్టి యొక్క వివిక్తప్రదేశంబున నందఱముఁ బ్రాయోపవిష్టులమై యుంటిమి అంగదుఁడు నీ వగపడమియును, వాలివధంబును, వానరుల ప్రాయోపవేశంబును, జటాయువు మరణంబును, సారె సారెకుం బేర్కొని శోకార్ణవ మగ్నుండై విలపించుచుండె. అప్పు డప్పర్వతకందరంబున నివసించియున్న సంపాతియను జటాయు సోదరుండు భ్రాతృవధంబు విని శీఘ్రంబున మా యొద్దకుం జనుదెంచి కోపంబున మద్భ్రాతయగు జటాయు వెవ్వనిచే నెచట నిహతుం డయ్యె నని యడిగెను. తన యనుజన్ముఁడు జనస్థానంబున భవదర్థంబుగా రావణునిచే నిహతుం డగుట యెఱింగి కొంత సేపు దుఃఖించి నీవు రావణాలయంబున నున్నటుల నెఱింగించెను.

మేమందఱము సంహృష్టచిత్తులమై ప్రాయోపవేశంబు చాలించి శీఘ్రంబునలేచి సముద్రతీరంబునకుం జేరితిమి. సముద్రలంఘనంబునం దసమర్థులై శంకించుచున్న వానరుల నందఱ నాశ్వాసించి యేనొక్కరుండ శతయోజనాయతంబైన సముద్రంబుదాఁటి రాత్రికాలంబున లంకాపురంబుఁ బ్రవేశించి రావణాలయంబు సర్వంబుచుం బరిశోధించి నిన్నిచటం జూడగంటిని. నీపతియగు రాముఁడు లక్ష్మణ సుగ్రీవ సహిత

ముగ మాల్యవంతమున నినుఁ దలఁపోయుచున్నవాఁడు. నేనిపు డచటికిఁజని నీవృత్తాంతంబుచెప్ప, కీశనికరంబులఁగూడి శీఘ్రంబునవచ్చి దశాస్యుందునిమి నిన్నుఁగొనిపోవును. సుగ్రీవుని పంపున నినుఁ గనుగొనుటకుఁ జనుదెంచిన రామకింకరునిగా నన్నెఱింగి సందియంబువిడిచి నాతో సంభాషింపుము.

ఇంకను సందియంబుగలదేని దానిఁదీర్చెద. ఇదె రామనామాంకితంబైన యంగుళీయకంబు. ప్రత్యయార్థం బమ్మహాత్ముండొసంగినఁ దెచ్చినవాఁడ. దీనిఁజూచితివేని నీమనంబునం బొడమిన సందియంబును దుస్సహసంతాపంబును దుఃఖంబునుం బాయును. దీనిం గొనుము. కాంచనాంగుళీయకంబు నొసంగినం బ్రీతిగ్రహించి జానకి భర్తృకర విభూషణంబైన దానిం బోలెజూచి రాముం జూచినట్లు మనంబున సంతసింప నిజవదనంబు శరత్కాల రాకానిశాకరమండలంబుం బోలె నఖండకళాపరిపూర్ణంబై యొప్పె.

అప్పుడా హనుమంతుని నిక్కంబుగ రామదూతయని నిశ్చయించి సందియంబు వదలి "హరివంశ శేఖరా! రామవిభుఁ డెప్పు డిచటికి వచ్చి దశకంఠుం ద్రుంచి నన్నెప్పు డయోధ్యకుఁ గొనిపోవును? నాదుఃఖసాగరమున కంతమెప్పు"డని యడిగెను. నేను భూవిభుఁజేరి నీవిచట నుండిన వర్తమానము దెలిపిన వెంట నాతండు. లక్ష్మణ సుగ్రీవ

సహితంబుగ వానర సైన్యములతో నేఁదెంచి దశాస్యు నాజ లోఁ బొరిఁగొని నిన్నుఁ దోడ్కొని పోవుట నిశ్చయము. ఈ మాటలయందు నీకు విశ్వాసము లేనిచో నీవిశ్వాస నామూ పుష్టిఁ గూర్చెదను. నేను రాక్షసుల జయించి యబ్ధిదాటి నిన్నుఁ గొనిపోయి భూవరున కొసంగెదను. నాభుజసత్త్వము నాప్రభావము నెఱుంగక నన్ను సామాన్యునిగ నెంచెద వేమొ నా నిజరూపము జూడుము" ని యమ్మారుత సంభ వుండు, శరీరవర్ధన వేగకృత శాఖాభంగధ్వని విని రాక్షసులు తన్నెఱుంగుదురని తలంచి" తత్ప్రదంబు నతిక్రమించి సీతా ప్రత్యయకారణంబునఁ ద్రివిక్రమదేవునిభంగి మేరుఁబొంది యమ్మహానందన కట్టెదుటఁ గనబడియె జానకి యాస్వరూప ముఁ జూచి "నారివరేణ్యా! నీసత్త్వంబును ధైర్యంబు నిప్పుడు తెల్ల ముగఁ దెలిసికొంటిని. నీవు మహాసత్త్వుఁడవు. పరాక్రమవంతు లలో నతివిశ్రుతుఁడవు. వాయుసమాన వేగుండవు నీబలప రాక్రమ విశేషంబున నేనపాయము నొందకుండ నన్ను రక్షిం చుకొని పోయెదనంటివేని, వానరసైన్యములఁ గూర్చి యుప క్రమపరాక్రమంబున రావణుని బాంధవసహితంబుగ రణంబున వధించి పౌరుషంబున నన్నుం గొనిపోవ నుద్యమించిన రాముని ప్రయత్నం బంతయు వైఫల్యంబు నొందు. అట్లు గాక రాక్షసుల వంచించి శీఘ్రంబునఁ గొనిపోయెద నంటివేని, మున్ను రాముని వంచించి కపట రూపంబున మ్రుచ్చిలించి సీతం దెచ్చిన రావణు సంగ్రామంబున వధింపంజాలక,

రాముండు తత్ప్రకారంబునఁ గ్రమ్మఱ జానకిం గొనిపోయె. ఎంతపరాక్రమహీనుం" డని శూరులు రాముని నిందుం తురు. దానంజేసి మానధనుండగు రాముని పౌరుషంబునకు హాని సిద్ధించు.

మఱియు వాళకీరవమును శ్రీరాముఁడుగాక నన్యుండు దాకనర్హుఁడుగాఁడు. నీచవర్తనుఁడగు నీనిశాచరుఁడు దస్కరుఁడై నన్నుఁ దాకినందుకు మనమునఁ జింతిల్లుచు వాని వధం గోరుచుంటిని. గావున నల్లభంగుల నన్నుంగొనిపోవుట నీకుఁ గర్జంబుగాదు. రాముఁడు భవత్సహితంబుగ యుద్ధార్థియై చనుదెంచిన నదియే మిక్కిలి శ్రేయంబగు. అనిన విని హనుమంతుండు సంతసిల్లి "అమ్మా! నీవాడినమాటలు రామపత్ని వగు నీకనురూపంబులై యున్నయవి. నీవుదక్క నొండుయువతి యీయాదృశంబైన వాక్యంబు పలుకఁజాలదు. నేను నీదుఃఖ హేతువులన్నియు వీక్షించి రామునకుఁ బ్రియంబుగ నమ్మహాత్మునితోడ నినుంగూర్పఁదలంపున గురుస్నేహంబునను భక్తియుఁ జేటపడ నిట్లంటి నంతియకాని వేఱొండుగాదు. నీవు చెప్పినయట్లు రామునికడకుంజని యమ్మహాత్మునితో నీవు సముద్రమధ్యంబున లంకయందు రాక్షసులచేఁ జిక్కియున్న చందంబును, నేనువినుచుండ రావణుఁడు నిన్ను బలికిన పలుకులను నీదుఃఖంబును, విన్నవించి శీఘ్రంబుగ లక్ష్మణసుగ్రీవ సహితుండగు రాముని నిచ్చటికిం దోడ్కొనివచ్చెద. నినుఁ

జూచివచ్చిన సగతి యదార్థమని రఘురామునకుఁ దోఁచు నట్లు దయచేసి యొకగుఱుతును దయచేయు"మని యడిగెను. అమ్మహీపుత్రి ప్రాణసమంబగు శిరోభూషణంబును దీసి యిచ్చి "రామునకు మనఃప్రియంబు సేయునిదియె చాలును. దీని నవలోకించి రాముఁడు నిక్కంబుగ నన్నుఁ జూచివచ్చిన వాఁడవని నిన్ను మన్నించు. సందియంబువల"దని చెప్పెను. హనుమంతుం డాభూషణమును చేతఁబుచ్చుకొని యామెచరణంబులు శిరంబుసోఁక ప్రణామంబుసేసి ప్రయాణోన్ముఖుఁడై చనియె.

అట్లుచను నెడ తనలో "నేనిపుడు రామునియొద్దకుఁ బోయి రావణుఁగుఱించి చెప్పిన నతఁ డేచందమువాఁడని యడుగును. అట్టియెడ వానిసత్త్వమెట్టిదగ నేనేమిచెప్పుదును. గనుక నారాక తెలియఁబఱచి విక్రమంబున దనుజులతో యుద్ధముచేసి వారిశౌర్యధైర్యంబులు తేటపఱచి పంక్తికంఠుని శౌర్యవీర్యసత్త్వబలగర్వసాహసంబుల నెఱింగి పోయెద. ముందుగా రావణుని కతిప్రియమై లతానికుంజతరుసంయుతమై నందనోపమంబగు నీకాంతారము నశింపఁజేసెద. అట్లొనరించినచో వాఁడలిగి దైత్యబలంబులఁబంపిన నేను వానిని రభసంబునఁ దాకి యాజింజంపి రామునొద్దకు నేగెద"నని చింతించి యటులసేయ నిశ్చయించెను. అనంతరంబున నాతండు వామూలంబు

లీలవృక్షంబులు విఱుచుచు, దంభోళియుంబోలె పర్వత శృంగములఁ బగుల వ్రేయుచు, శుండాలంబు చందంబున కమలాకరంబులు కలచుచు, పావకునిబోలె ద్రుమదావనంబుల భస్మీకరించుచు, కూర్మకంబులఁ బాఱంద్రోలుచుఁ శిలాగృహంబుల విఱుఁగంద్రోయుచు ఫలంబులు రాల్చుచుఁ బుష్పంబులున్మూలించుచు నిట్లనేక ప్రకారంబుల సీతయున్న శింశుపావృక్షంబొక్కటి దక్కఁ దక్కిన వనంబంతయు విధ్వస్తంబు గావించె.

సీతంగావలికొని యుండిన కొందఱు రాక్షసాంగనలు భీమరూపుండగు హనుమంతుని పరాక్రమ ప్రకారంబు రావణునకెఱిఁగించువారై యతిత్వరితగమనంబున బఱది వికృతాననలై దానవేంద్రా! ఎవఁడో వనచరుఁడొకఁడు మన యశోకారామమధ్యమునకు వచ్చి జనకజతోమాటలాడి వనమంతయు విధ్వస్తంబుగావించె. చూడ నొక మహీజంబైన లేదు. వీనిఁ జూచినమాత్రమునఁ జూపరులకు విస్మయంబును భీతియు గల్గుచున్నయది. వీని ననిమిషాధిపుఁ డంపెనో లేక యవనిసుత జాడనరసిరమ్మని రాముఁడు పంపెనో తెలియదు. ఏమాసీత కడకుఁజని యామర్కటపీరుఁ డెవఁడు? అతఁ డిచటికేలవచ్చె? నని యడుగఁ దానేమియు నెఱుఁగనియట్లు మాటలాడుచున్నయది. కావున మేము దడయక భయంబునఁ దూలుచు భీమరూపుండగు కపికుంజరుని వృత్తాంతంబు నీకు విన్నవింపఁ జనుదెంచి

తిమి ఆతండెవండో కనుంగొని శిక్షించి మమ్మురక్షింపు"మని విన్నవించిరి. రాక్షసేశ్వరుఁడు చితాగ్ని చండంబునమండి రోషవిశేషంబున నేత్రంబులవలన నగ్నికణంబులురాల నతి రౌద్రదగ్ధుండై హనూమన్నిగ్రహార్థం బెనుబదివేలరక్క సుల నియోగించెను. వారు మహానాదంబులుసేయుచు ముస లముద్గరాది వివిధసాధనంబులఁ గైకొని నగరంబువెలువడి యుద్ధాభిమానంబున దావాగ్నిలోనుఱుక గమకించు శలభం బుల చాడ్పున నవక్రపరాక్రమంబునం గ్రాలుచున్న సమీర కుమారు డాయంజనిరి.

అమ్మహావీరుఁ డమంద పరాక్రమంబున లేళ్లంగన్న సింగంబు భంగి నుప్పొంగి, కోసలాధిపుఁడగు శ్రీరామచం ద్రుని దాసుఁడనై భూధరంబులను గాసిలఁజేయు నంతటి మహాబలుండగు మహాబలుని పుత్రుఁడనై వాసవపద్మగర్భయ మవైశ్రవణాదుల వరంబులఁ బొందిన శౌర్యమున వ్రాలిన వాఁడి మగండనగు నాకు రావణుఁ డొక్కడు కాఁడు. రావణ సహస్రములైన నొకలెక్కయా? రాముని కరుణావిశేషమున భూరి శిలాతరు సాధనంబుల దనుజుల నందఱం దునిమి లంక ను దప్పక పాడుచేసి భూతనయకు మ్రొక్కి రాముకొద్ద కేగెదనని నిశ్చయించి సమరోన్ముఖుండయ్యె. రణంబునకుం జనుదెంచి భయశంకితులై యుండిన రాక్షసకింకరులు నసు న్నతంబైన సంధ్యాకాల మేఘంబు చందంబునఁ దోరణా

రూపంబై యున్న యమ్మహావీరుం జూచి కదియనరిగి భీమం బులగు నిశాత శస్త్రంబులం బ్రహరించిన, నవ్వానరసింహం బు కడునలిగి తోరణాశ్రితంబైన కాలాంత సమయంబగు పరిఘంబులీలం గేలనందుకొని రయంబున నాకాశంబున కెగసి విచిత్రగతులం దిరుగుచు మహావేగంబునం బఱతెంచి కసిగ్రిందు కతారంబున దైత్యులంబోలె నప్పుడు ఘోరయుద్ధంబున నొక్కొక్క వ్రేటునకు దశశత సహస్ర సంఖ్యాకులఁగా నద్దనుజ కింకరుల నిశ్శేషంబుగ రూపుమాపి లంకాపురంబు నకు లలామభూతంబైన చైత్యప్రాసాదంబు మీఁదికిఁ జని యందుఁ గావలియున్న రాక్షసశతంబును గాంచన స్తంభ ప్రహారంబునం బిట్టుకూల్చి యక్కాంచన హర్మ్యంబు కూలఁద్రోచె.

పదంపడి రావణప్రేరితుండై జంబుమాలి యనువాఁడు పెక్కండ్రు రక్కసులం గూడి డాసిన, ఘోరంబగు పరిఘం బుచేత నారాక్షసుని సైన్యసమేతంబుగ రూపుమాపె. జంబు మాలి మరణంబు విని రావణుండు బలవంతులగు మంత్రి పుత్త్రుల నేడ్వుర రణంబున కనుప వారినందఱ పరిఘంబు వ్రేటున గీటణఁగించె. క్రమ్మర దశగ్రీవుండు శూరులగు పంచ సేనాగ్రనాయకుల ననిచిన వారినెల్ల యమలోకంబున కనిచె. ఈపరాభవంబంతయు విని రాక్షసేశ్వరుండు విచారమగ్న మానసుండై తన కుమారుఁడగు నక్షకుమారుని రాక్షసగణా

స్వాతునిం జేసి యనిచిన హనుమంతుండించుకయు నందియాంబు లేక వానిరథంబుపై కుటికి వానిపదంబులు రెండును బట్టి ఘోరానిలతుల్యవేగమున నంబరవీధిని వేయిమారులు ద్రిప్పి ధారుణిపైఁ బడవైచెను. ఇట్లు పడవైచిన దేహంబాతయుఁ జూర్ణంబగుటయుఁ దత్క్షణంబ గతాసుండై వాఁడు యమలోకంబున కరిగె. తద్వృత్తాంతంబాతయు దశగ్రీవుండు విని శోక రోషవిషాద రూషితుండై తన ప్రథమపుత్త్రుండగు నింద్రజిత్తును బలోపేతుం జేసి పుత్త్రా! నీకుఁ గల తపోబలంబును బరాక్రమంబును దివ్యాస్త్రబలంబు నెవ్వరికిం గానను. నీవు రణంబునకుం జని స్వపరబలతారతమ్యం బెఱ్ఱుంగ విచారించి బలక్షయంబుగాకయున్న వైరిం బరిమార్పుము.

అయ్యగచరుండు కాలాగ్నికల్పుండు గావునఁ బాణి తలముష్టి ప్రహారణాదులచేత వధించుటకు శక్యుండుగాఁడు. వానికి వాయువుకంటె నధికజవంబుగలదు. వానియందు సైన్యంబులు బనిగొన వలసారంబైన వజ్రంబుగొని ప్రవేశింపకుము. నాచెప్పినయర్థంబంతయు మనంబునందలపోసి స్వకార్యసిద్ధికొఱకు నేకాగ్రచిత్తుండవై దివ్యాస్త్రబలంబు సంస్మరించుచు నిజవైరివధం బాపాదింపుము. సంగ్రామంబున నీకు నానాస్త్రంబులందు వైశారద్యంబుగలదు గావున నవశ్యంబు రణంబు గావింపు" మనిపలికె. మేఘనాథుండు వర్షాకాలంబునందు సముద్రంబుభంగి నుప్పొంగి గరుడానిలవేగంబులగు

హయంబులం బూన్చినరథంబెక్కి కాంచనవలయమండితంబగు చాపంబును శితశల్యంబులగు సాయకంబులుధరించి చతురంగ సేనాపరివృతుండై రణంబునకు వెలువడి శీఘ్రంబునం బఱతెంచె హనుమంతుండు దన శరీరమును బెంచి గర్జితమువెంపున దిక్కులు వ్రయ్యవార్చుచు నఖర్వభుజోలిప్తుండై యువ్వాకవిరోధినందనుని దాకెను.

ఇట్లు వానర దానవ వరులు సురాసుర వరులకైవడి తలపడి పోరాడునపుడు దాశకంఠి ఘోరాకారుండై పవమాన సుతుమీఁద నఖండసాయకముల నేయ హనుమంతుం డయ్యింద్రజిత్తుం దాకి బహు ప్రకారంబులం బోరి హీన సత్త్వుం జేసె. అతం డోపినంత బలంబుకొలఁది పోరి మారుతి తేజంబు దుస్సహంబగుటంగని, వీడవధ్యుండనియు నడిసన్నలం బోయెడివాఁడు గాఁడనియుఁ దెలిసికొని యతివేగుండై బ్రహ్మాస్త్ర పాశబద్ధుల గావించి దృఢపాశంబుల నంటఁ గట్టి శీఘ్రంబున రావణు నొద్దకుం గొని చనియె.

వానర సింహుండు త్రిలోకపూజ్య బ్రహ్మాస్త్ర పాశబద్ధుండై చేష్టలుదక్కి ధరణీతలంబునంబడి తన మనంబున నది బ్రహ్మాస్త్ర ప్రభావంబున నైన కృత్యంబుగ నెఱింగి తొల్లి పరమేష్ఠి తనకు మెచ్చి యిచ్చిన వరంబు తెఱంగు విచారించి బ్రహ్మేంద్ర మారుత పాలితుండనగు నాకు నీయస్త్రబంధంబు పాయుటెంత యని బ్రహ్మాస్త్ర

మంత్రిధ్యానమొనర్చి బంధవిముక్తుండయ్యె. అయినను బద్ధుఁ
డైన వాని తెఱఁగున గానిపింప రావణుఁడు నీవెవరవు. ఇట
కేల వచ్చితి" వని యడిగెను.

మారుతి, "నేను సుగ్రీవునకుహితుఁడనై హనుమంతుఁ
డను పేరఁబరగువాఁడను. అనఘాత్ముఁడగు రామునిదాసుఁడ.
ఆయనపంపున నేనంబుధిదాటి లంకకువచ్చి సీతనుజూచి విభుని
కుశలంబుచెప్పి సీతతోఁడ వాదించు తలఁపున వనము నేలపాలు
చేసితిని. దానవులందుకుఁగినిసి ధీరులై నన్నెదుర్కొన దేహ
రక్షణార్థము వారల వధించి నీమహాత్మ్యమెఱుఁగ నిటకు
వచ్చితిని. ఇదియె నావృత్తాంతము. మఱియు నీకు నేనొక
హితోపదేశంబుఁ జేసెద అదియెద్దియన నో దానవేశ్వరా!
అయోధ్యను దశరథుడను మహారాజు పాలించుచుండెను.
ఆయనకు శ్రీరామచంద్రుఁడనఁనొప్పు నగ్రసుతుఁడుగలఁడు.
ఈయన తనతండ్రిపంపున జటాజినముల ధరించి సీతాలక్ష్మణ
సహితుఁడై యరణ్యమునకువచ్చెను. ఇట్లువచ్చి జనస్థాన
సమీపమున నివసించియుండ నమ్మహాత్మునిభార్యయు లోక
మాతయునగు సీతను నీవు మ్రుచ్చిలించికొని తెచ్చిన నద్దేవిం
గానక యాతం డనుజసహాయుఁడై యరణ్యంబున వెదకుచు
ఋశ్యమూకంబునకుఁజనియె. అచట సుగ్రీవునితో సఖ్యము
జేసి యతని యగ్రజుఁడగు వాలిని రాముఁడవలీల నొక్కకోల
నేలంగూలనేసి యాతనిరాజ్యంబు సుగ్రీవున కొసంగి సమస్త

వానరగణాధిపుల వాలిని సధివాధునింజేసె. వాలిపరాక్రంబు తొల్లి నీవ్రుఁ గొంత యెఱింగినదే. అట్టివాలిం బరిమార్చి విజయలక్ష్మి విరాజమానుండై యున్న రామునకుఁ బ్రత్యుపకారం బొనరించు తలంపున సత్యసంధుండగు సుగ్రీవుండు సీత నన్వేషించి యున్నచోటెఱింగి రమ్మనుచు వానరుల నెల్లదిక్కులకుం బనిచె. అట్టివానర కదంబంబులో నేనొక్కఁడను. వాయుపుత్రుఁడను హనుమంతుఁడందురు. నేను జానకి నిచట వెదకఁదలఁచి సాగరము దరియించివచ్చి యమ్మానిని నశోకవనమధ్యమునఁ గనుఁగొంటిని. నరవానరుల పరిభావం బెఱుఁగనివాఁడవగుటం జేసి యజ్ఞానంబున సీతం దెచ్చితివి. ఇకనైన వివేకంబుగలిగి వానరవీరులు నీబలంబుల వధింపకమున్న యమ్మహాదేవి నమ్మహాత్ముఁడగు రామున కొసంగుము. వానరులకు లంకానాశంబు సేయునంత సామర్థ్యంబుగలదా యని శంకింపవలదు. వానరుల పరిభావంబు తొల్లి నీ వెఱుంగుదువు. యుద్ధసామర్థ్యంబు గూర్చిన వానరులందఱు దేవలోకంబునైన సాధింపఁగలరు. ఈయర్థంబు నీకుం జెప్పుమని సుగ్రీవుండానతిచ్చె. మఱియు నీవు సీతను సామాన్యకాంతగ నెంచి యిటకుఁగొనితెచ్చితివి. ఆమె నీకులముగూల్పఁబుట్టిన కాళరాత్రిగా నెఱుంగుము.

పతివ్రతా శిరోమణియగు నవైదేహి హృదయంబునం గల శోకానలంబున నీ పురం బిప్పుడ భస్మంబుగాఁగలదు.

విష్ణుతుల్య పరాక్రముండును సర్వలోకేశ్వరుండు నగు రాముని శరంబొక్కటి వేల్మిడిలోన సచరాచరంబు లగు లోకంబు లన్నియు సంహరించి క్రమ్మఱం దూణీరంబు వచ్చి చొచ్చు. అమ్మహాత్ముండు లోకంబుల నన్నింటి సంహరించి క్రమ్మఱ సృజించుటకు సమర్థుండు. ఆతనితో విగ్రహించుటకు నిఖలభూతంబులందు నెవ్వండును సమర్థుండుగాఁడు. అట్టి రాజసింహునకు విప్రతికారంబుఁజేసి యాతని బాణంబుల బారింబడి వధ్యుండవైతివి. నిన్ను రక్షింప మహేశ్వరుండును విరించియు శక్తులుగారు. ఆతనితో వైషమ్యముఁ బూని కొఱవితో దలగోకుకొంటి" వని గంభీరమునఁ బలికెను. హనుమంతుని వచనములు విని దశగ్రీవుం డుగ్రుఁడై రాక్షసులం జూచి వీనిం బరిమార్పుఁడని యాజ్ఞాపించెను. అంత విభీషణుఁడు దురాత్ముఁడగు తన యన్న పలుకుల కులికిపడి దూతను వధించుట ధర్మంబుగాదని తలంచి సామంబులగు వాక్యంబులతో నన్నకుఁ గోపోపశమనంబు సేయుచు, "అన్నా! దూతలు తమ యజమానులు చెప్పుమనిన రీతిని జెప్పెదరు. అందుచే యజమానులు దూషణీయులు గాని దూతలుకారు. ఇతఁడు తన యజమానుఁడు చెప్పిన విధమునఁ జెప్పె గావున నీతఁడు శిక్షార్హుఁడు గాడు. అంతియుగాక దూతలవధ్యులని విజ్ఞానిధులగు పెద్దలు పలికెదరు. దూతలపై కినుకవొడమిన యజమానుల నెదుర్కొని బల

పరాక్రమములఁ గనబరచి శత్రువులఁ దునిమిన పౌరుషము గాక ధూతం జంపిన నేమి పౌరుషము?

ఈవనచరుండు నిహతుండైన నీవయోనిధి నుత్తరించి క్రమ్మఱ నిచటికిరాగల ఖేచరుం డొక్కరుండైన రాముని సమీపంబున కీడు సతీవృత్తాంత నివేదనాభావంబువలన రామలక్ష్మణు లిచటికి యుద్ధార్థం బరుగుదేరరు. దానంజేసి నీకు శత్రుక్షయంబు సమకూడదు. వీనివలన సీతవృత్తాంతం బెఱింగి రేని రామలక్ష్మణులు తత్క్షణంబ రణార్థులై నీకడ కరుగుదెంచెదరు. దానంజేసి నీకయత్నంబున శత్రుక్షయంబు వాటిల్లు గావున నెల్లభంగుల వీనింజంపుట కార్యంబు గాదు.

వీఁడు నీచే విడువఁబడినవాఁడై రయంబునంజని రామలక్ష్మణుల యుద్ధంబునకుఁ దోడ్కొనివచ్చు. అందువలన యుద్ధప్రియుండవగు నీకు మేలగు. పరాక్రమోత్సాహవంతులైన సురాసురులకు దుర్జయుండవగు నీచే నువలాలితులైన యీరాక్షసయోధులందఱుఁ గరకండూతి నివారణార్థంబుగ రణంబుఁగోరియున్నవారు. వీరిమనోరథంబు వైఫల్యంబునొందించుట యుక్తంబుగాదు. వీరందఱు భవదర్థంబునం గాఁ ప్రాణంబులనైన విడువం గలవారు. వీరిలోఁ గొందఱు భవ

దాదేశంబున మూర్ఖులగు రాజపుత్రులఁబట్టి తెచ్చి భవదీయ పరిభావంబు ప్రకాశింపజేయుటకు వరుగం గలవారు. నామాటలువిని పీనిపై నలుకవిడిచిపుచ్చుమని చెప్పెను."

ఇట్లు పలికిన విధంబంతయు నాలకించి రావణుండు "తమ్ముడా! నీవు పలికిన విధంబెంతయు రాజనీతి యుక్తముగ నున్నయది. దూతలను శిక్షింపరాదనునది జగత్ప్రసిద్ధమే. వీనిఁ బంపినవానికి సిగ్గుగలుగునట్లు వనచరజాతికి భూషణమగు తోకనుఁ గాల్పించి వదలివేయుదమని నుడివెను."

ఇట్లు నిశ్చయించి రాక్షసుల నిరీక్షించి యీవానరుని తోకకు నిప్పంటించి ప్రదీప్తంబగు లాంగూలంబుతో బురంబు నల్గడలం ద్రిప్పి రండని యాజ్ఞాపించెను. అంత నారక్కసులు దైలావసిక్తంబులైన యనేక జీర్ణ కార్పాస వస్త్రంబుల వీరవరుని వాలాగ్రంబునం జుట్టి యనలుం బ్రతిష్ఠించిరి. లంకా పురంబునంగల నిశాచరు లందఱు ముదంబునొందిరి. అంత నక్కపిశ్రేష్ఠుండు శుష్కేంధనంబులచేత నభివృద్ధి వహించిన హుతాశనునిమాడ్కి నెదిగి వదనంబు బాలసూర్యునిలీలం గ్రాల మనసంబునఁ గ్రోధంబు చెంగలింప నత్యున్నత శరీరుం డై ప్రదీప్తంబగు లాంగూలంబుచే నచ్చటి దానవులం జది

యనిసెను. మఱియు క్రూరులగు కొందఱు రాక్షసులు దృఢ పాశంబులఁ దెచ్చి బద్ధుంజేసిన నప్పాశంబుల వలన విడివడ సమర్థుండనయ్యు, నట్లు చేయక 'బద్ధుండనైయున్నను నన్ని రక్కసులు నిగ్రహింపజాలరు. ఈబంధంబుల ద్రెంచికొని యీయసురాధముల నందఱ నొక్కపెట్టున వధింపఁజాలుదు, అయినను వేగిరపడనేల. ఈదనుజులు నాకొనర్పుచుండిన యవమానమును నరపతికార్యసిద్ధికై సహించియుండెద. మఱియు మున్ను రాత్రిసమయంబగుటయు నీలంకాపురంబునంగల సర్వస్థలంబులు విలోకింపరాదయ్యె. ఇప్పుడు దుర్గకర్మకౌశలం బంతయుఁ బరిశోధించెద. ఈరాక్షసులు సేయు శరీరపీడనంబును బుచ్ఛాగ్రంబున వెలుంగు వహ్నిదేవు వేఁడిమియు మచ్చిత్తంబున కించుకయు శ్రమంబుఁ గావింపఁజాలవు. పురీపరిశోధనాంతంబున బంధంబులఁ ద్రెంచికొని విజృంభించి రాక్షసులం బొలియించి విక్రమంబు ప్రకటించెద' నని నిశ్చయించి రజ్జువులం గట్టువడియున్న వాఁడు పోలెనొదిగి యుండె.

అమ్మహాబలనందనుని మహానుభావంబు నెఱుఁగక బలవంతులగు రాక్షసులు దీర్ఘపాశంబులం బ్రతిగ్రహించి వాయుసుతుఁ దోడ్కొని రాజవీధుల వెంబడి నేగిరి. అసురుల

కోలాహలశబ్దము వినుచు, రాజగృహంబుల చిత్రశాలల బరి శీలించుచు, విచిత్ర శిల్పిగృహంబుల దేవగృహాంగణములఁ జూచుచు, నంజనానందనుండు రక్కసు లొనర్చెడి పరాభవ మును సహించియుండె.

సీత శోక సంతప్తచిత్తయై యక్కపివరున కగ్నిదేవుని వలని బాధ గలుగకుండ మంగళం బొనంగుట కభిముఖయై నిర్మలంబగు తన మనంబున హుతాశను నుద్దేశించి నాపతి యే పుణ్యచారిత్రుఁడైన నేనే మహాసాధ్వినైన రామభక్తుఁ డగు మారుతాత్మజునకు శైత్యకారివగు మని ప్రార్థించెను. అద్దేవి మహిమవలన హనుమత్పుచ్ఛానలుండు ప్రదక్షిణా కాంక్షిఖుండై కపితల్లజు కుశలంబు దెలుపుచు వెలింగె. హను మజ్జనకుండగు సమీరుండు సీతా ప్రభావంబు వలనఁ సుఖ కరుండై వీచెను.

పవమాననందనుండు లాంగూలంబు దహ్యమానం బగుచుండ దనలో 'నొక్కపెట్టున జగంబుల నన్నిటి దహిం పంజాలు పావకుఁ డించుకైన తన యుష్ణతఁ జూపక శీత లుండగుచు వెలుఁగుచున్నవాఁడు. నాజనకుని సఖుఁడగు నన లుని కరుణయో, రామదేవుని విక్రమమో సీత దీవనయో,

దీనికిఁ గారణమై యుండు' నని యొకింత సేపు చింతించెను. మఱియు నాతఁడు మనమున రామలక్ష్మణ సీతార్కతనయా నిలవాత సఖులకు నమస్కరించి తన శరీరంబు కుఱుచ గఱిచి యంగుష్ఠమాత్రగాత్రుండై బంధనంబుల వలన విడివడియె. రాక్షసులు నిరీక్షించుచుండఁ దత్క్షణంబు పెంచియు మేరు మందర సంకాశదివ్య దేహుండై పురద్వారంబు మీఁది కతి వేగంబున దాఁటి పరిఘంబు విలోకించి దానిం బుచ్చుకొని తన్నుం గాదికొని పరివేష్టించి వచ్చువారిని నిశ్శే షంబుగ రూపు మాపెను. మఱియు నాతఁడు "వనభంగము గావించితిని పెక్కండ్రు దనుజుల నాజిని దారుణముగ దునిమితిని. ఇఁక నేను చేయవలసి యుండినది దుర్గవినాశ మొక్కటియె. అది నేనిపుడు చేసిన, రాముఁడు వచ్చి దశ కంఠునిఁ జంపుటయె మిగిలియుండు" నని యెంచి దుర్గంబుం తయు దగ్ధంబు గావించెద నని నిశ్చయించి వాలాగ్నిం దరి కొలుపుచు సౌదామినీ సమన్వితంబగు తోయదంబు లీల లంకాభవన శృంగశృంగాటకంబుల యందుఁ జరించుచు నొక్క గృహంబునుండి వేఱొక్క గృహంబు మీఁదికి నెగ యుచు మహోద్యానపంక్తులు విలోకించుచు వసంతాస్తుండై సమీరసమానవేగంబునఁ బ్రాసాదంబుల మీఁదికి దాఁటుచు,

ప్రహస్తుఁడు మహాపార్శ్వుఁడు జంబుమాలి, వజ్రదంష్ట్రుఁడు మొదలగు రక్కసుల గృహంబుల నెల్లను దహించె.

విభీషణు మందిరమొక్కటి తక్కఁ దక్కంగల భవనంబుల నాశనముచేసి కనక మహీధరంబు క్రియఁ గ్రాలెడు రావణుని భవ్యవిమానముఁజేరి ఘనవాలాగ్రగతాగ్నినమ్మణిమయాగారముపై నుంచి నీరంధ్రయగాంత నీరదము క్రివిని గర్జించె. అంత హుతాశనుం డంబర చుంబిశిఖా పరంపరుండై ఛటచ్ఛట శబ్దంబులతో విస్ఫులింగంబు లెగయ, నవ్విమాన మొక్క నిమిషంబున దహించె. మఱియు నవ్వైశ్వానరుండు హనుమద్విసృష్టుఁడై తొల్లి రావణుని భయంబున స్వరూప ప్రకటనంబుసేయ నోడియుండి తత్కాలంబున రాక్షసబలక్షయంబును దైవ బలోదయంబును బ్రత్యాసన్నంబగుట మెఱింగె. నిశ్శంకితుఁడై లంకాపురాధార త్రికూట శిఖరంబునం బొడమి వాయుసహాయుంబునంజేసి భీమ పరాక్రమంబున లంకాపురంబు సర్వంబు నాక్రమించి జ్వాలాసమూహంబు ప్రసరింపంజేసి గగనంబు దాఁకం బెరిఁగె. ఇట్లు లంకాపురంబు సర్వంబు నావరించి యశనినినాద నికాశంబులగు బహువిధ దారుణ శబ్దంబులచేఁ బంకజాత భవాండ భాండంబు పగులంజేయుచుఁ బ్రళయ కాలాగ్ని చందాన నతి భీకర దర్శనుండై వెలుంగుచుండె.

ఇమ్మహాద్భుత కర్మంబు విలోకించి దేవర్షి బ్రహ్మర్షి సిద్ధ సాధ్య గంధర్వ విద్యాధర కిన్నర రక్షో యక్ష చారణాదులు పరమానంద భరితాంతఃకరణులై సాధు వాక్యంబుల నభినందించిరి.

ఇత్తెఱంగున వనభంగంబు గావించి రణంబున ననేక రాక్షసులం బొలియించి లంకాపురంబంతయు హుతాశనున కర్పించి సముద్రోదకంబున వాలానలంబు చల్లార్చి కృతార్థుండై పాదచారియున్న మేదినిభంగి జూపట్టు లంక నవలోకించి” “అక్కటా! ఏనెంత యవివేకిని. మహీసుతనయు చొప్పరయక తాల్మివీడి యీలంకయంతయు ఘోరానలజ్వాలలం గాల్చితిని. ఆమంటలబడి సీత గతాసువై యుండును. లంకయందు భస్మము కాని ప్రదేశం బించుకయు లేదు సీత వహ్నిశిఖలం జిక్కక మనియున్నదని యెట్లు నిశ్చయింపనగును. కుపితాత్ముండనై ప్రతిజ్ఞావిపర్యంబున నొకింతయు వెఱవక శ్రీరామకార్యముం జెఱచితిని. కపులందఱు నన్ను స్వామిఘాతుకుండని యేల యనరు? రోసంబున దోసంబుం జేసితి. ముల్లోకములందు మదీయకపిత్వంబు ప్రథితంబయ్యె. రావణుండు సీతం జంపక ముద్రిపలించి కానిపోవు. నే నద్దేవి నజ్ఞానంబునం జంపితి.

రామునకు నాకంటె రావణుఁడె యెక్కింత మేలు వాఁడయ్యె.

ఇఁక నత్తెఱంగున హరీశ్వరుఁడగు సుగ్రీవుని సందర్శింపఁబోదుఁ? నరేశ్వరులగు రామలక్ష్మణులతో నేమని సంభాషింతుఁ? అకృతార్థుండనై యమ్మహాత్ముల సమ్ముఖమ్మునకుం జనుకంటె నాకిచట జలంబులం బడియైనఁ జిచ్చులో నుఱికియైనఁ బాశంబులచే నుఱిగొనియైన విషంబు గ్రోలియైన సముద్రచరంబులగు మహాసత్వంబులకు మదీయ శరీరమాంస ఖండంబులు సమర్పించియైనఁ బ్రాణత్యాగంబు సేయుట యుచితంబై తోఁచుచున్నయది. అచ్చటికిం బోయిన సీతా వృత్తాంతంబు విని. రామలక్ష్మణులును వెనువెంట భరత శత్రుఘ్నులును సుగ్రీవాదులును శోకసంతాప పీడితులై యంతంబు నొందెదరు. భాగ్యరహితుండను ప్రధర్మార్ఘ సంగ్రహుండ క్రోధరోష పరీతాత్ముండనగు నేనింతకుం గారణంబునైతి. నని యనేక ప్రకారంబుల దీనుండై చింతించుచుండె. అట్లు కొంతవడి చింతాక్రాంతుండై తెలివి నొంది తన మనంబున.

ఉ. 'ఏజలజాతపుణ్యమున నించుకయైనఁ బ్రచండకీర్తి కీ
లాజనితోగ్రబాధకుఁ దలంకక నాశమునొంద కేను దే

జో॥ జయశాలినై సుఖము సొంపు వహింపఁగఁగంటి నట్టియా
ర్యాజ వినాశమొందె నని రిత్తదలంచితి నెంతవెఱ్ఱినో॥

అని తలఁచుచుండ నింగి నేగెడు సిద్ధచారణులు వైదేహి వహ్నిబాధకుఁ జిక్కక కుశలంబున నుండె నని పలికిరి. హనుమంతుండు విని జానకి కుశలంబున నున్నదని నిశ్చయించి కలంకదేఱి సంప్రాప్త మనోరథుండును బ్రీతి సంహృష్ట సర్వాంగుండునై ప్రత్యక్షముగ నద్దేవిని దర్శించి యనుజ్ఞగొని రాముని యొద్దకుం జనియెదఁ గాక యని తలంచి యశోక వనంబునకుం జనియె.

అచట సీతను గాంచి కడు సంభ్రమమున వందన మొనరించి తల్లీ! దైవయోగంబున నయ్యనలార్చులఁ గ్రాఁగక శుభంబున నొప్పు నిన్ను మరలఁ బొడగంటినని పలికిన భూపుత్రి కనుల హర్షబాష్పము లొలుకఁగ రామభూవిభుని మనమునఁ దలఁచి "పవన తనూజ! రఘురాము కార్యముఁ దీర్పగ నీవొకఁడవ చాలుదు. తాను లేని సమయము గని దొంగ యై వచ్చి నన్ను దీసికొని వచ్చినందుకు సైన్యసహితముగ వచ్చి రావణాదుల ననుచరసహితముగ వధించి తిరిగి

నన్ను దీసికొనిపోవుటయే తగిన ప్రతికారము. మహాశూరుం డగు నీవంటి భక్తుఁడుండిన నిట్టి కార్యము జరుగుటకు సంది యమేల?" నని చెప్పిన మారుతి "అమ్మా శ్రీరాముఁడు వానర బలాన్వితుఁడై యేగుదెంచి రావణాదుల వధించి ధ్రువ ముగ నిన్ను గొనిపోవును. నీవు సందియము గాని సుఖస్థితి నుంచుము. నేనిప్పుడ జని రఘురామునికి సర్వము దెలియఁ జెప్పి యతనిఁ దోడ్కొని చనుదెంచెద" నని వైదేహినాశ్వా సించి సముచితంబుగ వీడ్కొని స్వామి సందర్శనోత్సుకుండై సముద్రప్రాంతకాంతారమండితంబైన యరిష్టంబను నొక కొండ నెక్కి యవ్వనధిం దాఁటఁగోరి మింటి కెగసెను. సాగరోపరిభాగంబునం జనుచుండు హనుమంతుఁడు సముద్ర మధ్యంబున నుండు హిరణ్యనాభ నామకంబగు పర్వత శ్రేష్ఠం బుం బొడఁగని దానిఁ గరంబున సంస్పృశించి గుణవిముక్తం బగు నారాచంబు కరణి నతివేగంబున నుత్తర తీరంబునకుం జని యంగదాది కపులఁ దర్శించి తాఁ జేసిన దంతయుఁ దెలి యఁ బరచెను.

వానరవీరులందఱు నచట నుండి బయలు వెడలి సుగ్రీ వ రామలక్ష్మణుల కడకు నేగుదెంచి వృత్తాంతమంతయు విన్న

వింప వారలు వానరబల సహితముగ లంకకుఁ జని రావణ కుంభకర్ణాదుల పుత్రమిత్ర సహితముగ వధించి సీతం గైకొని కుబేర పుష్పకముపై నునిచి యయోధ్యకుఁ గొని పోయిరి.

సంపూర్ణము.



శ్రీరామప్రెస్, రాజమండ్రి.

# తప్పొప్పుల పట్టిక.

---:o:---

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 7 | శిలభక్తులు | శివభక్తులు |
| 5 | 14 | పటుఁజాలక | పట్టుఁజాలక |
| 26 | 7 | ఆని | అని |
| 28 | 12 | జంపుగావింపక | జంకుగావింపక |
| 43 | 10 | ఫల్గునుఁడు, పార్థుఁడు | ఫల్గునుఁడు, జిష్ణుఁడు, పార్థుఁడు |
| 46 | 11 | సాతుజముల | సామజముల |
| 77 | 19 | వామనసింగు | వామనరావు |
| 95 | 2 | దఃర్యోధనుఁడ కారణంబు | దుర్యోధనుఁడ కారణంబు |
| 113 | 6 | లున్మూలించును | లున్మూలించుచు |
| 115 | 1 | కదియనదిగి | కదియనరిగి |
| 121 | 5 | కీడు | లేదు |
| 128 | 17 | పజలజాతు | పజలజాక్షి |

## By the same author.

రు. అ. పై.

శ్రీవిశ్వామిత్రీయము (Approved for school use) 0—12—0

రాజమహేంద్రవరము—పెద్దాపురము తాలూకాల భూగోళము—రాజమహేంద్రవర మహాపట్టణభూగోళము సహా

(Approved for school use) 0—4—6

రామచంద్రపురము—కాకినాడ తాలూకాల భూగోళము—కాకినాడమహాపట్టణ భూగోళముసహా

(Approved for school use) 0—4—6.

రాజోలు—అమలాపురం తాలూకాల భూగోళము 0—4—6.

N. B. భూగోళములు పటములతో చక్కగ సమర్చబడియున్నవి.

The above books can be had of:—

M. R. Ry. Ajjarapu Parvatisam,
Innespeta, Rajahmundry.

or

M. R. Ry. P. Narasimham,
Vadapalli, Kothapeta P. O.
East Godavary Dt.

